ఓంకార గ్రంథమాల. ఓమ్. ప్రథమ ప్రసూనము

మహాత్మాగాంధికి జయ్.

# ఖాదీతత్త్వము

జానకీ ప్రెస్, ప్రొద్దుటూరు.



శ్రీయుత కోట నాగభూషణంగారు.

# తొలిపలుకు.



బెజవాడలో 1929 సం॥ నవంబరు నెలలో జరిగిన ఆంధ్రమహిళాసభయందు కద్దరుతీర్మానముపై గావింపబడిన ఈ రెండు యుపన్యాసములు కద్దరుతత్త్వమును సంపూర్ణముగ వెల్లడించుచున్నందునను, అయ్యవి గ్రంథబాహుళ్యము గాక సర్వులకు నందుబాటులో నున్నందునను, వీని నొక పొత్తముగ ముద్రింపించి యుచితముగ పంచిపెట్టటవలన కద్ద రుద్యమమునకు మేలుసేయగలమని తలంచి మే మీ ప్రచుర ణమునకు బూనుకొంటిమి. కద్దరు దీక్షాబద్ధులును, అశేషాను భవజ్ఞులును నగు శ్రీయుత అద్దేపల్లి వెంకటగుర్నాధరామ శేషయ్యగారు ఈ గ్రంథము నచ్చువేయించుటకు కొంత ధన సహాయ మిప్పించుటయేగాక ఈ గ్రంథమునకు పీఠికనుగూడ వ్రాసియిచ్చినందుకు మా వందనములకు వారు పాత్రులగు చున్నారు. కద్దరుప్రియుడగు యొకమిత్రుడు కద్దరునుగూర్చి సప్రమాణముగ వ్రాసియిచ్చిన వ్యాసమును ఈ గ్రంథమున కనుబంధముగ జేర్చడమైనది. జె. సి. బోసుగారి కద్దరుసిద్ధాం తమును వేదాంతరీత్యా రుజువుచేయుచు వ్రాయబడిన వ్యాస ముకూడ నిందు గలదు. దీనినంతను ఆమూలాగ్రముగ చదివిన ప్రతివాడును విదేశవస్త్రములను వర్జించి కద్దరుదీక్షను తప్పక యవలంబించగలరనెడి యాశయమే మమ్మీప్రపత్రికా ర్యమునకు బురికొల్పినది. ఉడుతాభక్తివంటి మా సేవను దేశ జనులు పరిగ్రహించి మమ్ము కృతకృత్యులం జేయుదురు గాక.

విజయవాడ, 15–1–1930.

కోట నాగభూషణం, కార్యదర్శి,
విజయవాడ వైశ్యమహాసభ.

# పీఠిక.

నిర్మలాత్మ స్వరూపులారా !

నేనీ పుస్తకమునకు పీఠికను వ్రాయబూనుట కడుసా హసము. ఐనను, నేనువ్రాయుటకు కారణము మీారికముందు చదువబోవు కద్దరు తీర్మానము నుపపాదించి బలపరచిన సోద రీమణు లిద్దరియొక్క జన్మవృత్తాంతము బాగుగా నెరిగి కద్ద రుద్యమప్రారంభమునుండి నేటివరకు కొద్దిగనో గొప్పగనో నూలువడుకుచు, కద్దరు వస్త్రదీక్ష సక్రమముగ ననుసరించు నేను వ్రాసినచో యెక్కువ లాభకారియని నామిత్రుడు మ. రా. శ్రీ. కోట నాగభూషణము గారు నన్ను కోరగా, కద్దరుద్యమమే దైవారాధనగా భావించు నాకు వ్రాయ నుత్సాహము కలిగినది. కదళీఫలములను బోలు ఇందలి ఉప న్యాసములను పైనున్న చర్మమును బోలు నాచప్పని పీఠికను జదివి, విసికి, అసలుతీర్మానమును పై యుపన్యాసములను చదు వకయుందురేమో యను భయముచే నా పీఠికను సంక్షేప పరచినాను. చదువరులు కద్దరుపన్యాసములను సాకల్యముగ చదువ ప్రార్థించు చున్నాడను.

కద్దరు తీర్మానము నుపపాదించి బలపరచిన సోదరీ మణు లిద్దరు, నాబాల్యమున సహాధ్యాయి యగు మ॥ తూను గుంట్ల రామస్వామి గుప్తగారి ప్రథమ ద్వితీయ పుత్రికారత్న ములు. శ్రీ రామస్వామి గుప్తగారు అసహాయోద్యమ ప్రారంభ మప్పుడు బాపట్లగ్రామమున న్యాయవాది వృత్తి

యందుండిరి. శ్రీ గాంధిమహాత్ములు ఆవృత్తిని విసర్జించుడని వ్రాసిన మాటనే, అప్పుడే అభివృద్ధికి వచ్చుచు వచ్చుచు నెలకి రు 1000 సంపాదనాపరుడై, అప్పటికి విశేష నిల్వచేయక కడు దుస్తరమైన కుటుంబభారము తనమీద నున్నను సరకు సేయక, వృత్తిని విసర్జించి, సత్యాన్వేషణకై కాలముగడుపుట ప్రారంభించిన పుణ్యపురుషుడు. శ్రీద్ధాభక్తులతో తలిదండ్రుల యొద్ద గాని గురుకులమున గాని నీతివిద్య నందినపిమ్మటం అత్తవారియిల్లు ప్రవేశించినచో, అగృహమును స్వర్గధామ ముగజేసి తమవారికి ఇహపరములు చూపగలరను విషయము ధృవపరచుటకై ఈ బిడ్డలను తయారుచేసిరి. శ్రీ గుప్తగారు మానవులు ముక్తిజెందుటకు శరీర మవసరమనియు, ఆశరీర మును ఆహార నియమములకు లోబరచినచో ఆత్మ సాక్షా త్కార సాధనకు గొప్ప సోపానమగు ననియు నమ్మి తాను ఆహార నియమములచే బొందిన అనుభవములు శ్రీ గాంధి మహాత్ములకు బహిరంగ లేఖవ్రాసి, తద్వారా గొప్ప ప్రజా సేవ జేసిరి. అట్టివారి గర్భమున నుదయించిన స్త్రీరత్నముల యుపన్యాసముల యందు ఎన్ని గొప్పభావము లుండవు? వా రుభయులును గావించిన ఉపన్యాస వివరములను సాకల్య ముగ చదివితిని. వారు చెప్పిన కద్దరుద్యమమునందు ఆధ్యాత్మిక, ఆర్థిక, రాజకీయ తత్త్వములు మూడును ఇమిడియున్నవి. కాని ఎంత దీనిని గురించి చెప్పినను కొంతవరకే చెప్పగల ముగాని, అనుభవముచే తెలిసికొదగినది చాలకలదు. బెల్లము తియ్యగానున్నదని చెప్పగలము. తీపి ఎట్లుండు నను ప్రశ్నకు

అనుభవముచే మాత్రమే జవాబు తెలిసికొనవచ్చును. కాన నీవిషయమై నా యనుభవముల గొన్నింటిని బొందుపరచ నున్నాడను.

మనము నూలును రెండు సాధనములచే వడుకగలము. రాట్నము మీదను, చేకదురు, లేక తఖిలీద్వారాను చేయ గలము. చేకదురు స్వల్పకరీదు. రాట్నముమీద కంటె అతి సన్న నిదారము చేకదురు మీదనే తీయగలము. చేకదురు మీదను నెమ్మదిగా తయారగును. కాని విశేషము తయారు కాజాలదు. దీనిమీద మానవు లెంత సన్న నినూలు తయారు చేయగలరో ప్రదర్శనములో ఆమహాశక్తిని జూపుటకుపయో గించును. కాని విశేషసరుకు తయారై ప్రజాసామాన్యము నకు లాభకారి కానేరదు. మరియు మనము ఎక్కడకు వెళ్లినను వెంటతీసికొని వెళ్లి కాలము వ్యర్థపుచ్చక వడుకుటకు వీల గును. ఇక రాట్నమును గురించి ముచ్చటించెదను. వడుకుటకు చక్రమును త్రిప్పుటతోడనే ఒకనాదము వెలువడును. ఆనాదము ఈశ్వరోపాసకులకు వినవచ్చు నాదబ్రహ్మమును బోలిశ్రవణానందమగును. కొంతసేపు వడుకగ, ఇంకను వడుక వలెనను ఉత్సాహము జనించును. అందుచే విశేషకాలము కూర్చుండి వడుకుదుము. తద్వారా ఆసనసిద్ధి కలుగును. అప్పుడు మనశ్శాంతి కలుగును. మంచి మంచి భావములు జనించును. మనకుపకారముచేసిన వారిసంగతి జ్ఞాపకమువచ్చి నను, తిరిగి వారి కుపకారము చేయవలెనను ఇచ్ఛ నశించును. కొన్నాళ్లు వడికినపిమ్మట సన్నని దారము తీయ ప్రేమ కలు

గును. దారము సన్నముగా వడకనారంభించిన కొలది దృష్టి నిగిడించుట అభ్యాసమగును. అట్లు విశేషకాలము ఒకేవస్తువు నందు దృష్టి నిలుపుటయందు అభ్యసించుటలో మనకు ప్రపంచము మరపునకు వచ్చును. ధ్యానపరులు యీస్థాయికొరకు విశేషముగ పాటుపడుదురు. తీవ్రమైన కోపమువచ్చినప్పుడు చక్కనిదారమేరాదు. కాన శాంత మభ్యాసపడుటకే ఆధ్యాత్మికతత్త్వ వివరణమైయున్నది. పైనవ్రాసినప్రకారము శాంత స్వభావము, ప్రేమ, పట్టుదల, ఓపిక, కార్యదీక్ష ఇవియేర్పడుటచే కష్టపడి కొంతనూలువడికి బట్టలు తయారుచేయించుకొందుము. ఆబట్ట వాడుకొన ప్రారంభించుట తోడనే దాని యందుగల ప్రేమచే జాగ్రతగ వాడుదుము. జాగ్రతగావాడుటచే కొద్దిబట్టలతో విశేషకాలము గడుచును. అందుచే చాల ఖర్చుతగ్గును. ఈ స్వభావము క్రమశః అలవడి జీవితములో విషయాసక్తి తగ్గినను కావలసినవి, స్వయంకృషి సలిపి జీవితమును చులకనచేసికొననగును. అట్లుచేసికొనుటచే పరాధీనత పోవును. ఈ స్థాయి కుదిరినప్పుడే విదేశవస్త్రమును ధరింపజాలడు. అందుకై చలించని దీక్షపట్టును. సం 1 కి 60 కోట్ల రూపాయిలలో తనవంతైనను విదేశమునకు బోనీయక మన దేశమున నిలుపగలిగినవా డగును. అందుచే మనదేశమున ఆర్థికతత్త్వము అభివృద్ధిజెందును.

మన ప్రభువులు యావన్మందియు వర్తకులైయున్నారు. అందు ముఖ్యముగ బట్టలవర్తకము చేయువారే ప్రభుత్వములో గొప్పస్థానముల నధిష్ఠించియున్నారు. ధనవంతులకు

పేదల కష్టములు బాగుగా తెలియజాలవు. మన ప్రభువులకు ఆర్థికప్రవాహము తగ్గినప్పుడు మన బాధలు వారు గుర్తింప గలుగుదురు. అందు మనకున్న రాజకీయసమస్య దాని యంతట అది పరిష్కారమగును. అయితే ఇన్ని తత్త్వములతో గూడిన యీ మహత్తరోద్యమము బ్రహ్మర్షి యనదగు గాంధి మహాత్మునిచే సంకల్పింపబడినను ఎందుచే త్వరలో అభివృద్ధి చెంది సమస్య పరిష్కారము కాలేదని శంకపొడమవచ్చును. పాశ్చాత్యవిద్యాప్రముఖులలో మన దేశనాయకులని ప్రజ లభిప్రాయపడి ఆధారపడువారిలో ననేకులు ఇప్పటివరకు చక్కగ దారము వడుకనేజాలరు. వడుక గలిగినను నీటుగా వడుకలేరు. అందుచే మనదేశమున కీగతి పట్టినది. వేదికలెక్కి యుపన్యాసము లిచ్చుచున్నారు. కాని కద్దరును ధరించుట లేదు. అందుచే యీ యుద్యమమురొక్క మహాశక్తి ఇంత ఆలస్యముగ ప్రదర్శనమగుచున్నది.

ఇప్పటికే యీపీఠిక దీర్ఘమైనందున తమ మృదు మధుర భావశైలితో తీర్మానమును ప్రవేశపెట్టి బలపఱచిన యీ బాలికల ప్రజాసేవకు, వారు ఆయురారోగ్యాభివృద్ధి జెందునటుల నేను ఆశీర్వదించుచు, చదువరులుకూడ, అబ్బాలిక లికముందును తమ శక్తికొలది దేశాభ్యుదయభావము లను ప్రజలకొసంగి మానవసేవచేయుటకై వారిని ఆశీర్వదింపవేడుచున్నాడను.

బెజవాడ,
26–12–1929. } అద్దేపల్లి వెంకటగుర్నాథ రామ శేషయ్య.

# విషయసూచిక.


| సంఖ్య | విషయము | పుట |
| --- | --- | --- |
| 1 | పీఠిక | 1 to V |
| 2 | కద్దరుయొక్క ఆర్థికతత్త్వము | 1 |
| 3 | ,, ,, రాజకీయ ఆధ్యాత్మికతత్త్వములు | 29 |
| 4 | ,, ,, పూర్వచారిత్రము (అనుబంధము) | 59 |
| 5 | ,, ,, ముక్తిమార్గము<br>జె. సి. బోసుగారిసిద్ధాంతము | 96 |
| 6 | తుదిపలుకు | 152 |
| 7 | షరా:— "కద్దరుయొక్క పూర్వచారిత్రము" ఇందలి యంశములు శ్రీయుత, యర్. యస్. వరదాచార్యులు మున్నగువారి "Hand spinning and Hand weaving" అను ఆంగ్లగ్రంథమునకు శ్రీయుత ఉన్నవ లక్ష్మీనారాయణ గారి అనువాదము ననుసరించి వ్రాయబడినవి. | |

# శుద్ధాఽశుద్ధపట్టిక.

| పుట | పఙ్క్తి | అశుద్ధము. | శుద్ధము. |
|---|---|---|---|
| 22 | 8 | తరుదాత | తరువాత |
| 41 | 11 | ప్రతిపాదకమైన-భుజస్కం | ప్రతిపాదకమైన యజ్ఞసూత్రమునుభుజస్కం |
| 46 | 7 | యత్ప్రత్నే | యత్ప్రత్నీ |
| 54 | 18 | గుడ్డలలో | గుడ్డలతో |
| 55 | 17 | పరధర్మాస్వ్వను | పరధర్మాత్స్వను |
| 56 | 16 | వార్ణేయ | వార్ష్ణేయ |
| 57 | 4 | ఆగ్ని | అగ్ని |
| ,, | 16 | తనుకు | తమకు |
| 62 | 18 | వెలిసిపోగట్టితనము | వెలిసిపోనట్టి గట్టితనము |
| 67 | 17 | ఇంగ్లండు ప్రవాహము | ఇంగ్లండుకు ప్రవాహము |
| 82 | 4 | ఫత్యేక | ప్రత్యేక |
| 97 | 21 | సంబంధింపబడి | బంధింపబడి |
| 101 | 3 | యథానిత్యంహ్యావిభా | యథావిత్వంహ్యావిభా |
| 104 | 3 | ఆయ్యాది | అయ్యాది |
| ,, | 11 | పుణ్యావాచన | పుణ్యాహవాచన |
| 114 | 22 | పురుషలు | పురుషులు |
| 115 | 1 | ,, | ,, |
| 121 | 19 | అంత | అండ |
| 129 | 11 | తత్పు | తత్పురుష |
| 132 | 7 | త్రికోణాకారమై అద్దము | త్రికోణాకారమైనఅద్దము |
| 134 | 11 | Concentrative | Concentration. |
| 149 | 2 | కారము | కారకము. |



శ్రీమతి ఇలింద్ర సరోజనీ దేవిగారు.

(వయస్సు - 13 సంవత్సరములు)

అపక్వాహారమును సాధించిన యువతి.

నెం. 1 రు.

ఆంధ్ర మహిళా సభ,

బెజవాడ.



# కద్దరుతీర్మానము

(ఆర్థికతత్వము.)




ఉపపాదకురాలు:

ఇలింద్ర సరోజిని దేవి.

తూనుగుంట్ల రామస్వామి గుప్తగారి

ద్వితీయ పుత్రిక




ఓమ్.

నారీమణులారా !

కద్దరునుగూర్చి నే నిప్పుడు మీసమక్షమున నుపన్యసింపబూనుట మీకంటె ఆవిషయమై నాకు అధికముగ తెలియునను గర్వముచేత కాదని మనవి చేయుచున్నదానను. స్వదేశోద్యమము ప్రారంభమైనదిమొదలు ఈ యెనిమిది సంవత్సరముల నుండియు నేను కద్దరును దీక్షగా ధరించుట చేతను, అప్పుడప్పుడు రాట్నముమీద నూలు వడకుచుండుటచేతను నాకీ యుద్యమమున మిగుల అభిమానము కలిగినది. ఇట్టి అభిమానమును తమకు గాఢముగ గలిగింపవలెనని నాకు గలిగిన సంకల్పమే నన్నీ యుపన్యాసమునకు పురికొల్పినది. కాని అన్యముకాదు. కాన నేను మనవిజేయు సంగతులను శ్రద్ధతో శ్రవణముజేయ ప్రార్థించుచున్నాను.

కద్దరునందు ఆర్థిక, రాజకీయ, ఆధ్యాత్మిక తత్వములు విలీనములై యున్నవి. హిందూదేశము యొక్క ఆర్థిక, రాజకీయ సమస్యలు రాట్నముమీదనే ఆధారపడి యుండుటచే గాంధిమహాత్మునకు కద్దరుపట్లగల 'గాఢవిశ్వాసము మరియొక యంశముపై లేదనుట నిర్వివాదము.) కద్ద రొక్కటే దరిద్రనారాయణున కుపశాంతినొసగి దేశమునకు స్వాతంత్ర్యము నిచ్చునను గాఢవిశ్వాసము మహాత్ముని ప్రేరేపించుచున్నది. కాంగ్రెసు నిర్మాణకార్యక్రమాంశము లన్నిటిలో కద్దరే

మూలమనియు, కద్దరు వ్యాపించినత్రైన మిగిలిన భారత సమస్య లన్నియుగూడ నెరవేరుననియు మహాత్ముడు నమ్ము చున్నాడు. రాష్ట్రముయొక్క ఆర్థికసమస్యాపరిష్కారము కుదిరినచో రాజకీయసమస్య దానియంతట నదియే పరిష్కారమగునని ఆయనయొక్క దృఢనిశ్చయము.

ఈ కారణముచేతనే కద్దరుసమస్యను రాజకీయ సంబంధమునుండి ఆయన తొలగించినాడు. కద్దరుద్యమమును కాంగ్రెసువారి యధీనమునుండి తొలగించి భారతతంతుకారకసంఘముయొక్క వశమం దుంచినాడు. కాన కద్దరునందు రాజకీయవాసన తొలగి అయ్యది దేశీయపరిశ్రామిక విషయమైనది. ఇందుచే దొరతనమువారును, సర్కారు ఉద్యోగస్థులును ఈ కద్దరుద్యమమున బాహాటముగ కృషిం జేసినచో వారికి రాజకీయదండనాభయము లేదు. ఈ సభలో నెవరైన సర్కారు ఉద్యోగస్థు లున్నయెడల కద్దరుప్రశంస వచ్చినదని వారు భీతిల్లి లేచి వెళ్లవలదనియు, శిక్షాస్మృతి 124- ఏ. 153 శెక్షన్లుగాని క్రిమినల్ ప్రొసీజరుకోడ్డు 144 శెక్షనుగాని వారిని బాధించనేరవనియు అభయహస్త మిచ్చుచున్నాను. చేతిపరిశ్రమలనుగూర్చి విచారించుటకై యేర్పడిన ప్రభుత్వపు ప్రత్యేకోద్యోగి తంజావూరు, దక్షిణార్కాటు జిల్లాల పరిస్థితులనుగూర్చి వ్రాసినరిపోర్టులో చేతినూలు

పరిశ్రమ ప్రజలకు అనుబంధపరిశ్రమముగ పనికివచ్చు ననియు, అయ్యది వారికి ఉత్కృష్టమగు వృత్తియగు ననియు తెల్పియున్నాడు. పైగా చేతినూలు పరిశ్రమను పోషించుటకు గవర్నమెంటువారు పూనుకొనియున్నారు. ఇందుకు నిదర్శనము కావలెనంటే మద్రాసునుండి వచ్చు తపాలా జాబులమీాద జనరల్ పోష్టాఫీసు ముద్రను చిత్తగింపుడు. "సపోర్టు ఇండియన్ ఇండస్ట్రీస్" అనగ హిందూదేశ పరిశ్రమలను పోషింపుడు. అని ఆపోష్టుముద్రలో యుండును. దీనినిబట్టి చేతినూలు పరిశ్రమను పోషించుటకు గవర్నమెంటువారు కృషిచేయు చున్నట్లు ధృవపడగలదు. కాన సర్కారునౌకర్లు దీనినిగూర్చి అలజడి నొందనక్కరలేదని మనవి చేయుచున్నాను.

ప్రజలీ సమయమున సలుపదగిన కనీసధర్మము విదేశ వస్త్రములను పూర్తిగ విసర్జించి కద్దరును అభిమానముతో ధరించుటయే అయి యున్నది. ప్రతివారును తాము వడికియు, ఇతరులు వడుకునటుల నేర్పాటుజేసియు కద్దరు నిర్మాణమును త్వరితముగ కొనసాగింపవలెను. మనదేశదారిద్ర్యము తొలగవలెనన్న మన దేశస్థులకు కావలసిన వస్త్రములును, నూలును, మన దేశములోనే తయారు కావలసిన అవసరము గలదు. భారతదేశమునందు 32 కోట్ల ప్రజలు కలరు. అందు

పట్టణవాసులు 3 కోట్లను, గ్రామవాసులు 29 కోట్లును అయి యున్నారు. అనగ నూటికి 90 వంతున ప్రజలు పల్లెటూరువాసులై యున్నారు. ఈ ప్రజలయొక్క ఆర్థికపరిస్థితు లెట్లున్నవి? అమెరికా సంయుక్త రాష్ట్రములయందు సగటున ఒక్కొక్కరు దినమునకు రు 3-0-0 లును, ఆస్ట్రేలియాలో రు 2-4-0 లును, ఇంగ్లాండులో రు 2-2-0 లును, కెనడాలో రు 1-10-0 లును, భారతదేశమున 0-1-7 లును సంపాదించుచున్నారు.

ఇంత తక్కువరాబడి కలిగినను ఈదేశమునుండి సంవత్సరమునకు విదేశవస్త్రములు, విదేశనూలు నిమిత్తము 66 కోట్ల రూప్యములు పోవుచున్నవి. అనగా మనిషి 1 కి సాలుకు రు 2-0-0 వంతున చెల్లించవలసి యున్నాడు. గత 10 సంవత్సరములలోను వస్త్రములకొరకును, నూలుకొరకును మన దేశమునుండి 660 కోట్ల ధనము ఖర్చుపెట్టబడెను. గత 30 సంవత్సరముల లెక్కలను పరిశీలించి చూడగా నీ దేశమున మనిషి 1 కి సంవత్సరమునకు 13 గజముల గుడ్డ కావలసియున్నట్లు తేలుచున్నది. ఇందులో $4\frac{1}{3}$ గజముల గుడ్డమాత్రమే ఇతరదేశములనుండి వచ్చుచున్నది. తక్కిన $8\frac{2}{3}$ గజముల గుడ్డ ఈ దేశమున మిల్లుమగ్గములవలనను, చేతిమగ్గములవలనను తయారగుచున్నది. విదేశ

వస్త్రము నుపయోగించకుండుటకై మనిషి 1 కి సగటున $4\frac{1}{3}$ గజముల గుడ్డ నధికముగ తయారు చేయవలసి యున్నది.

మనిషి 1 కి $4\frac{1}{3}$ గజముల చొప్పున 32 కోట్ల ప్రజలకును మొత్తముమీద 138 కోట్ల గజములగుడ్డ అధికముగ నిచ్చుటనే తయారు కావలసియున్నది. సాధారణముగ ఒక మనుష్యుడు 8 గంటలలో నెం 10 రు నూలును గంటకు 350 గజముల చొప్పున 2800 గజములు నూలు వడుకగలడనియు, ఆనూలు ఒక గజము గుడ్డకు సరిపోవు ననియు నిపుణులు తెలుపుచున్నారు. దినమునకు 8 గంటలు చొప్పున 300 దినము లొకరు పని చేసినచో 300 గజముల గుడ్డ తయారు కాగలదు. ఈలెక్క నను సరించి మనకు కావలసియున్న 138 కోట్ల గజముల గుడ్డను తయారు చేయుటకు 46 లక్షలు నూలు వడుకువారు కావలసియున్నారు. ఈ దేశమున 50 లక్షల రాట్నములు సిద్ధముగా నున్నవి. అందులో 40 లక్షల రాట్నములు పనిచేయుటయే లేదు. నూలు తీయువారిని ప్రోత్సహించి ఈ రాట్నములకు పని కల్పించవలసియున్నది. 32 కోట్ల ప్రజలుగల ఈ దేశమునందీ కార్యము దుస్సాధ్యమా? ప్రతి 200 మంది ప్రజలలోను ముగ్గురు మాత్రమే వడికినచో నీ కార్యము సఫలము నొందును. గ్రామములలో సంవత్సరమున 3 మాస

ములు పనిలేకుండనుండు వారిసంఖ్య 11 కోట్లు గలదని అంచనా వేయబడెను. అందులో సుమారు 2 కోట్లమంది మాత్రము పని లేనికాలమున నూలు వడుకుట ప్రారంభించిన యెడల కద్దరుసమస్య పరిష్కారము కాగలదు.

వీరుగాక ప్రతి గ్రామమునను ముఖ్యముగ పట్టణములయందు ఎందరు పనిపాటలు లేక అన్నమో రామచంద్రా యని సత్రములవెంటను, సంతర్పణగృహముల చుట్టును, తిరుగుచున్నారో విచారించుడు. ఎందరు ఉపాదానమునకును, ముష్టికిని, మధూకరమునకును, సంచార మొనర్చుచున్నారు ? వీరిలో కేవలము వికలాంగులే కొలదిమంది మాత్రమో కలరు. తక్కినవారలు పనిపాటలు జరుపుకొనుటకు అంగసౌష్ఠవము కలిగియుండియు సోమరిపోతులై, తిండికిమాత్రము తిరుగులాడుచున్నారు. వీరికి మన దేశములో అన్నసత్రములు, దేవాలయసంతర్పణలు భోజనవసతిని గల్పించుచుండుటచే వీరు సోంబేరులై పని అంటే అసహ్యపడుచున్నారు. ఇట్టివారు అనేక లక్షలు మనదేశమున కలరు. ఒక్కొక్కరికి దినమునకు రు 0-8-0 చొప్పున కూలిచ్చి రాట్నము, మగ్గము పని నేర్పించెదమని మహాత్మా గాంధి వంటి మహనీయు లనేకులు వారి నాహ్వానించిరి. కాని ఆ సోమరిపోతు లిచ్చిన జవాబు వినతగియున్నది. "అయ్యా!

మేము పనిచెయ్యకుండ సత్రములలోను, దేవళములలోను మాకును, మా కుటుంబమునకును అన్నము దొరకుచుండగ మేము కష్టపడి రాట్నపుపని యేల చేయవలెను? నాలుగిండ్లకుక్కుంటే మాకు జీవనము గడుస్తుంది. మీపని మాకవసరము లేదు." ఈ ప్రకారముగ మన సత్రములు సోంబేరీలను, గడేకార్లను తయారు చేయుచున్నప్పుడు, మనదేశ ఆర్థికస్థితి యెట్లు బాగుపడునో తమరే యాలోచింపుడు.

ఇంక మధ్యమతరగతివారిలో ముఖ్యముగ స్త్రీలు పనిపాటలులేని సమయములో, గవ్వలు గచ్చకాయ లాడి కొందరును, లోకాభిరామాయణం కబుర్లు చెప్పకొని కొందరును, ఇరుగింటి పొరుగింటి తగవులువినుచు కొందరును, నిద్రా కలహములలో జిక్కుకొని కొందరును వృధాగా కాలము గడుపుచున్నారు. వీరు నూలును వడికి కద్దరు సమస్యకై యేల తోడ్పడరాదు? ధనవంతుల యిండ్లలోని స్త్రీల సంగతి వేరుగ చెప్పనక్కరలేదు. తాము కద్దరును ధరించకపోగా, ధరించినవారిని గూర్చి హేళనచేయుటయందు నిపుణలై యున్నారు. స్వదేశవస్త్రములను ధరించుట తమకు భారమట, అందవిహీనమట, నాజూకు తక్కువట, స్త్రీలకుగాని పురుషులకుగాని అంద మక్కరలేదని నేను చెప్ప సాహసించుట లేదు. ముఖ్యముగ స్త్రీలు అలంకారములను కోరవలసినదే.

కొన్నిచోట్ల పుట్టింటివారు విదేశవస్త్రధారులును, అత్తవారు స్వదేశవస్త్రధారణ దీక్షాపరులును అగుచున్నారు. ఇట్టిస్థితిలో సాధ్వీలలామలు తమ పుట్టింటికి వచ్చినప్పుడు తండ్రిగారి యుత్తరువు ననుసరించి "కద్దర్‌కు జయ్" అని జయజయనాదములు సలుపవలసి వచ్చుచున్నది. అత్తవారి యింట్లో అడుగుబెట్టుట తోడనే, అత్త ఆడుబిడ్డల ఉత్తర్వుల నెత్తినిడుకొని "సీమ మల్లులకు సలామ్" అని అనవలసి వచ్చుచున్నది. జనకగృహము ను ప్రవేశించిననాడు తల్లిదండ్రులు తమ ఆడుపిల్లల యొక్క విదేశదుస్తులను విడిపించి ఒకమూలను అంటువస్త్రములమాడ్కి మూటగట్టించి ఎవరును తాకకుండ పదిల పఱచుచున్నారు. ఈ వనితారత్నములు తిరిగి తమ యత్తవారి యింట్లో పాదముపెట్టుటతోడనే అత్తమామలు రివ్వురివ్వున పరుగిడుచు వచ్చి కోడలు ధరించియుండిన స్వదేశ వస్త్రముల నూడబెరికి, ఈగాంధి గుడ్డలపీడ తమ గృహములో సంకర మొనర్చకుండ జాగ్రత్తగ మూటగట్టించి ముట్టుగదిలో భద్రముగా నుంచి బీగమువేసి యుంచుచున్నారు. ఇయ్యది కల్పితమైన కట్టుకథ కాదు. కొన్ని తావులలో జరిగినవాస్తవచరిత్రమై యున్నది.

స్త్రీ తన పుట్టింటికి వచ్చినప్పుడు నిరాడంబరజీవులైన తన తల్లిదండ్రులు,

"భూషలు కావు మర్త్యులకు భూరిమయాంగద తారహారముల్"

అను పద్యమును బాడి ఆమెవంటిమీదనున్న సున్నిత ములైన సువర్ణాలంకారములను తీయించివైచెదరు. ఆ స్త్రీ తిరిగి అత్తవారి యింటి కేగుటతోడనే అత్తగారు

"స్త్రీణాం రూపం సీమకమలానిచ"

అని శ్లోకమును కల్పించి, మూటగట్టియున్న ఆభరణ ములను విప్పి కోడలి మెడలో బంగారు బండారములను తిరిగి తగిలించుచున్నది.

"పుట్టింటికిపోతే ఫేమ్,
అత్తవారింటికిపోతే షేమ్."

ఈ విధముగ స్త్రీలు ఈఫేము, షేములమధ్య సంచ రించుచు స్వదేశ విదేశవస్త్రములకు సలామ్, గులాములు కొట్టవలసి వచ్చుచున్నది. స్త్రీలయొక్క ఈ యవస్థను కని పెట్టియే కాబోలు

"నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి"

అనగ స్త్రీకి స్వతంత్రము సున్న- అని మనపూర్వపు పెద్దలు శాస్త్రిల వ్రాసిపెట్టినారు. పోనిండు. పూర్వకాల మున సీతమ్మతల్లి పడినకష్టములకంటె యిప్పుడు స్త్రీలు హెచ్చుకష్టము లనుభవించుచున్నారాయేమి ? అని యొకింత

ధైర్యము బూని, పాప మాస్త్రీ, తనపుట్టింటికి పోయి నప్పుడు గాంధిగుడ్డను కట్టుకొని, అత్తవారియింటికి పోగానే మాంచెస్టరుమల్లును ధరించుచున్నది. పుట్టింటికి పోగానే భారమైన బంగారపు నగలు తీసివైచియు, అత్తవారియింట్లో అడుగుబెట్టగానే వాటిని తిరిగి తగిలించుకొనుచును యున్నది. ఇటు పుట్టింటివారి ప్రోత్సాహమునకును, అటు అత్తగారి అడావుడికిని మధ్యను రాజీనామా కుదుర్చుకొని ఎట్లనో, స్త్రీ యీ స్వదేశవిదేశవాతావరణములమధ్య జిక్కి, చిక్క ములోని పిట్టవలె జీవితమును గడుపుకొను చున్నది.

ఈ విధముగ, బ్రతికియుంటే బలుసాకైన తినవచ్చు నని స్త్రీ తలంచుచుండ, మూలిగేవాని నెత్తిన తాటికాయ పడ్డట్లు, గోరుచుట్టుమీద రోకటిపోటు తగిలినట్లు యీస్త్రీని జూచి అమ్మలక్కలు సూటీపోటీలను ప్రయోగించుచున్నా రు. "ఏమీ, ఈయిల్లాలు మొన్నటి దినము గాంధిగారి గుడ్డలు సింగారించుమని సభలో లెక్చర్లు గొట్టిందే! ఇదేమి కర్మమో? మళ్లా తా నొద్దన్న మాంచెష్టరుమల్లే చుట్టుకొ న్నదే? చూడండమ్మా! ఈ చోద్యం; ఈ యిల్లాలు మొన్నమీటింగులో ఆడవాళ్ళకు ఆభరణా లెందుకని గుక్క తిప్పకుండా కూసి, యిప్పుడు వంటినిండా చేతులనిండా

సంకెళ్లు తగిలించిందమ్మా!" ఈ విధముగ గాంధిగుడ్డలను ధరించు స్త్రీలు, కత్తెరపోట్లకు లోనగుచున్నారు.

హిందూ కుటుంబస్త్రీల స్థితిగతు లెట్లున్నవో ఒక్క పర్యాయము కరుణాసాంద్రులైన ఈ సభవారు తప్పక పరిశీలించవలసియున్నారు.

"కరువుమంటే కప్పకు కోపం
విడువుమంటే పాముకు కోపం."

ఈ తీరుగనున్నది హిందూవివాహితస్త్రీల సంగతి. పుట్టింటికి పోయినప్పుడు తల్లిదండ్రుల యాజ్ఞానువర్తియై కద్దరును ధరించనిచో తల్లిదండ్రులకు కోపము. అత్తవారి యింటికి వెళ్లినప్పుడు అత్తమామల ఆడుబిడ్డల వాంఛాతృప్తికై ఫరంగీదుస్తులను ధరించనిచో అత్తమామల ఆడుబిడ్డల ఆగ్రహామునకు ఆహుతికావలసివచ్చుచున్నది. పోనిండు ఏయెండ కాగొడుగును పట్టెదమని తలంచి పుట్టింటికి వచ్చునప్పుడు స్వదేశీ ముతకగుడ్డను, అత్తవారింటికి వెళ్ళినప్పుడు విదేశీయ నాజూకు దుకూలమును ధరించి ఇటు తల్లితరఫువారిని అటు అత్తతరఫువారిని తృప్తిపరచి తరించవచ్చునని తీర్మానించుకొన్నను, కష్టపడ నక్కరలేకయే పితృపితామహార్జిత ధనముతో కడుపులో నీళ్లు కదలకుండ కాలిమీద కాలువేసి

కొన్నను, నోట్లో ముద్ద కలిపిపెట్టే నౌకరీ శ్రేణులును, పరి చారిక పటాలములును గల అమ్మలక్కల మూతివిరుపుళ్ళకు మాత్రము గృహిణి సహించజాలకయున్నది. కందకు లేని దురద చేమ కెందుకో తెలియదు. తల్లిదండ్రులు తృప్తిజెంది నప్పుడు అత్తమామ లాదరించినప్పుడు అమ్మ లక్కలకు-ఈ కక్కస మెందుకో గోచరముకాదు.

మహాత్మాగాంధి హిందూదేశముయొక్క ఆర్థిక రాజ కీయసమస్యలు కద్దరుమీదనే ఆధారపడి యున్నట్లు కబుర్లు చెప్పుచున్నాడు. కాని నిజమైన గృహస్థతత్వము నెరిగినవా డైనచో, హిందూదేశముయొక్క మోక్షసిద్ధి ఓర్పులేని ఈ అమ్మలక్కలమీద నాధారపడియున్నట్లు ప్రకటించవలసి యున్నాడు. మహాత్ముడు స్త్రీలనుకూడ కద్దరును ధరించవల సినదని బోధించినప్పుడు పాప మాయనపైన వేర్కొనిన అమ్మలక్కల చివాట్లకు గురియగుచున్న స్త్రీలకష్టముల గుర్తెఱిగి చెప్పినట్లు కనిపించదు. అందుచే కద్దరుయొక్క సంపూర్ణతత్వ మింకను యీ అమ్మలక్కల యంగీకారమును బడయవలసియున్న ట్లున్నది. ఇంతవరకు స్త్రీలవిషయమై ముచ్చటించితిని.

ఇకను పురుషుల సంగతి బహు చోద్యముగానున్నది. కొందరు సభలలోనికి వచ్చినప్పుడు మాత్రం కద్దరుదుస్తులను

లను ధరించి, ఇండ్లకు పోవుటతోడనే భార్యలపోరు పడ లేకనో, లేక తమభారమును తగ్గించుటకో ఆకద్దరువస్త్రముల నూడదీసి పదిలముగపెట్టి పూజసేయుచు, తిరిగి మీటింగు లకు వెళ్లునప్పుడు ఆదుస్తులను ధరించుట ఇటీవల ఆచారమై యున్నది. మనవాండ్రు భోజనముచేయునప్పుడు మడిగుడ్డలు కట్టుకొని, ఆపని పూర్తికాగానే వాటిని పదిలపరచి తిరిగి భోజనమునకై వెళ్లునప్పుడు ఆమడిపంచలను ధరించిన చంద మున కొందరు పురుషులు చమత్కారముగ వ్యవహరించు చున్నారు. ఇదియంతయు సభలలో గౌరవమును సంపాదించు టకై చేయు ప్రయత్నమై యున్నది. ఇట్టి చర్యలవలన దేశ దారిద్ర్యము తీరునా ? మహాత్ముని హితబోధ మంటిపాలగు చున్నదే ?

హిందూదేశబీదజనుల కష్టార్జితధనము సాలుకు 66 కోట్ల రూప్యములు చొప్పున ధనప్రవాహమును విదేశ ముల వైపునకు మరల్చి దేశజనులను దరిద్రవంతులుగ చేసిన వా రెవరు ? ఆంగ్లేయు లని కొంద రభిప్రాయ పడుచున్నారు. జపానువా రని మరి కొందరు వాదించుచున్నారు. జర్మనీ వా రని ఇంక కొందరు తలంచుచున్నారు. మన భారతదేశ మును కూటికిని గుడ్డకును మొగము వాచినట్లు చేసి దేశ జనుల రక్తమాంసములను పీల్చివేసిన మన ఆర్థికశత్రువులు

ఆంగ్లేయులు కారు, జపానువారు కారు, జర్మనీవారు కారు. ఈ ఖాదీయుద్యమమును మహాత్ముడీయెనిమిది సంవత్సర ములనుండి దీక్షగా సాగించుచు, దివారాత్రములు స్వయ ముగ సంచారముజేసి ప్రబోధించినను, ఇంక నేపురుషుడు కద్దరువస్త్రమును ధరించక విదేశగుడ్డను కట్టి కులుకు చున్నాడో, ఆతడే మన దేశదారిద్ర్యమునకు కారకుడగు చున్నాడనియు, ఏస్త్రీ స్వదేశ ఖాదీ దుస్తులను దూషించి తన దృష్టిని లాంకషైర్ గోహర్జాన్ చీరెలమీద వాల్చి, మోహించి మురియుచున్నదో ఆస్త్రీయే మనదేశసౌభాగ్య మునకు గర్భశత్రువనియు ప్రఫుల్లచంద్రరాయ్‌వంటి కద్దరు అభిమానులు అభిప్రాయపడుచున్నారు. మరియు "హిందువు లచే అస్పృశ్యులనబడువారు నిజముగా అస్పృశ్యులు కారు. అస్పృశ్యుడనువాడున్నచో విదేశవస్త్రములను ధరించు వాడే అస్పృశ్యుడని నేను తలచుచున్నాను." ఈ ప్రకా రము, ఇటీవల బొంబాయిలో జరిగిన బహిరంగసభలో సేట్ జమన్‌లాల్ బజాజీగారు నుడివియున్నారు.

ఈ గుడ్డకొరకేగదా మహాత్ముడీ పది సంవత్సరము లును కఠిన దీక్ష వహించి బహుకష్టముల పాలగుచున్నాడు! ఈ గుడ్డకొరకేగదా అనేక దేశభక్తులు జయిల్‌ఖానాలో బందీకృతులై బాధపడుచున్నారు ! ఎందరు యువకులు

కారాగృహమునబడి అన్నాహారములను వర్జించి ప్రాణా వశిష్టులైయున్నారు! ఇట్టివారిని జూచియైన మీరు కారుణ్యము వహించి కద్దరును పోషించరాదా? మహాత్ము డాంధ్రదేశసంచారము గావించినప్పుడు ప్రజలు చూపిన యుత్సాహము, అలజడి యిప్పు డేమైనది? మహాత్మునకు కానుక లర్పించి యున్నంత మాత్రమున మన కర్తవ్యము ముగిసెనా? మహాత్మ డొక్కనితోనే యీ మహత్కార్యము పూర్తియగునా? రాబోవు డిశంబరు 31 తేది రాత్రి 12 గంటల వరకు మాత్రమే మహాత్ముడు గడువుపెట్టిన సంగతి మీరు మరచితిరా? ఇంతదనుక నిర్మాణకార్యక్రమ మెంతవరకు సఫలమైనదో లెక్కలను చిత్రగించితిరా? మహాత్ముని తలపై భారము నుంచి మనము మాత్రము తప్పించుకొనుటయా?

విద్యాధికులును, ధనవంతులును కద్దరును విరివిగా ధరించుటకు దీక్షబూనుచో, జనసామాన్యము వీరి ననుకరించెదరనుటకు సందియములేదు. కద్దరు తయారగుచున్న పలుతావులలో గ్రామవిద్యాభివృద్ధియు, మద్యపానము పట్ల నిరుత్సాహమును వ్యాపించుచున్నవి. ఈ దేశములోని కద్దరుద్యమమంతయు అఖిలభారతచర్ఖాసంఘమువారి యాజమాన్యమున జరుగుచున్నది. ఈ సంఘమునకు ధర్మకర్తలు పదునలుగురు. వారిలో.

1 మహాత్మాగాంధి—అధ్యక్షులు.
2 సేట్ జమన్‌లాల్ బజాజి—కోశాధిపతి.
3 శంకర్‌లాల్ బ్యాంకర్—కార్యదర్శి.

| | |
|---|---|
| 4 సి. రాజగోపాలాచారియర్.<br>5 గంగాధరరావు దేశపాండే.<br>6 బాబు రాజేంద్రప్రసాద్.<br>7 వల్లభభాయ్ పటేల్.<br>8 సతీస్ చంద్రదాసు గుప్త.<br>9 జవహరిలాల్ నెహూ్రు.<br>10 మణీలాల్ కొఠారి.<br>11 వి. వి. జయరాజనీ.<br>12 కె. సంతానం.<br>13 డాక్టరు, బి. సుబ్రహ్మణ్యం.<br>14 కొండా వెంకటప్పయ్య. | గార్లు - పరిపాలక సంఘ సభ్యులు. |

ఈ చర్ఖాసంఘము వారి కేంద్రకార్యాలయము అహమ్మదాబాదులో నున్నది. అన్నిరాష్ట్రములయందును శాఖాకార్యాలయములు ప్రత్యేకకార్యదర్శులక్రింద నడుపబడుచున్నను, కార్యనిర్వహణమంతయు కేంద్రకార్యాలయమువారే వహించుచున్నారు. (1) ఖద్దరు సంస్థలను విరివిగా నుత్పత్తి చేసి ప్రజలలో వ్యాపింపజేయుటయు (2) నూలు వడుకువారి సంఖ్యను వృద్ధిజేయుటయు (3) దేశములో ఖద్దరుపై నభిమానము పుట్టించుటయు (4) తద్వారా

జీవనోపాధులు లేనివారికి జీవనోపాధులు గల్పించి దేశము లోని సంపద బీరుపోకుండ చేయుటయు - వీరి లక్ష్యములు.

తంతుకారకసంఘము జనించిన నాటనుండియు ఖద్ద రుపై వీరు తమ దృష్టిని కేంద్రీకరించుచున్నారు. వివిధరా ష్ట్రములలో సత్వరాభివృద్ధి కలుగుచున్నది. కాంగ్రెసు సం ఘమువారు 14 లక్షల రూపాయలను ఈసంఘమున కిచ్చిరి. పిమ్మట మహాత్ముని పర్యటనము మూలమున 7 లక్షలు చేకూరెను. ఈ 21 లక్షతో నీసంఘము తన పనిని ప్రారం భించెను. వీరు గత సెప్టెంబరువరకు 21 లక్షల ధనమును ఖద్ద రునిమిత్తమై పెట్టుబడి పెట్టిరి. 1000 (వెయ్యి) మంది ప్రచా రకు లీ సంఘముక్రింద పనిచేయుచున్నారు. వీరి యాజమా న్యముక్రింద 500 ప్రతిష్ఠాపనలు పనిజేయుచున్నవి. ప్రయివే టుసంస్థలను ప్రోత్సాహపరచుటకు గాను, ఈసంఘమువారు కొంతగ్రాంటు నిచ్చుచున్నారు. కద్దరు సర్వీసులో చేరు వారి శిక్షణకై సబర్మతీ ఆశ్రమములో సాంకేతిక పాఠశాల యొకటి నిర్వహింపబడు చున్నది.

రాష్ట్రములలోని అభివృద్ధి.

1 ఆంధ్రదేశమున పలువిధములగు కద్దరు తయారగు చున్నది. ముతకకద్దరు అన్ని జిల్లాలలోను దొరకును. మధ్య రకం గుంటూరు, తూర్పుకృష్ణా మండలములలోను, సున్నిత

మగు కద్దరు గంజాం, విశాఖపట్టణములలోను తయారగుచున్నది. శ్రీకాకుళం, రామకృష్ణాశ్రమము, పల్నాడు, గురువారెడ్డి పాలెం, తుని, సీతానగరం, కైలాసపట్నం, అనకాపల్లి, నెల్లూరు మండలమున కానుపూరు, ఈ కేంద్రస్థానములలో కద్దరుపని విరివిగా జరుగుచున్నది.

2 బీహారునందు కద్దరువ్యాప్తి కవకాశములు చాలగలవు. బీహారుశాఖకు 8 ఉత్పత్తి సంఘములును, 16 విక్రయాంగణములును గలవు.

3 వంగదేశ మిప్పుడు, ఖాదీయుత్పత్తియందు ద్వితీయస్థాన మాక్రమించుచున్నది. ఇందుకు మూలకారకులు సతీస్ చంద్రదాసు గుప్తగారు. వీరు ఖాదీప్రతిష్ఠాపనము నెలకొల్పి తద్వారా అద్భుతమగు సేవజేసిరి. కలకత్తా కార్పొరేషను వారు వీరియొద్దనుండి తమకు కావలసిన సరుకులను కొనుట కంగీకరించిరి. అభయాశ్రమము, ప్రవర్తక సంఘము, కాలీసుపురపుఆశ్రమము కద్దరుత్పత్తికి విశేషముగ తోడ్పడుచున్నవి.

4 బొంబాయికి రాష్ట్రీయశాఖ లేదు. ఖాదీ భండారమువారు వివిధరకముల కద్దరును తెప్పించి అమ్ముచున్నారు. రాష్ట్రీయ స్త్రీసభవారును, దాదారుభండారమువారును కద్దరును విక్రయించు చున్నారు.

5 బర్మాలో తంతుకారకసంఘమువారు ఒక్క భాండారమును రంగూనులో భరించుచున్నారు.

6 ఢిల్లీ రాష్ట్రమునందు మీరట్‌లోని గాంధి ఆశ్రమమువారు కద్దరుత్పత్తికిని, విక్రయమునకును తోడ్పడుచున్నారు.

7 గుజరాతునందు స్వోపయోగమునకై నూలువడుకువారు పలువురుందురు. 700 కుటుంబములవారు తమకు కావలసినకద్దరును తామే తయారుచేసి కొనుచుందురు.

8 కర్నాట రాష్ట్రమునందు ప్రాచీన కాలమునుండియు నూలువడుకు ఆచారము కలదు. మైసూరునందలి బడ్నవేలులో కద్దరు పరిశ్రమను ఆప్రభుత్వమువారు పోషించు చున్నారు. కద్దరు సహకార సంఘము లీరాష్ట్రమున 15 స్థాపింపబడెను.

9 మహారాష్ట్రమునందు రెండు ఉత్పత్తికేంద్రములు గలవు.

10 పంజాబునందు నూలువడుకుట ఆచారముగ వచ్చుచున్నది. ప్రతిగ్రామమునందును రాట్నములు కొన్ని తిరుగుచుండును. తమకు సరిపోవునూలును ఆయా కుటుంబములవారు తయారుచేసికొను చుందురు.

11 రాజస్థానమునందు గూడ నూలువడకుట ఆచార ముగ నున్నది. దీనియందు 5 ఉత్పత్తిస్థానములును 3 విక్రియసంఘములును గలవు.

12 తమిళనాడు నందు ప్రస్తుతసమయమున ఉత్పత్తియు విక్రియమును గూడ అత్యధికముగ నున్నది. హిందూదేశమున తయారగు కద్దరులో 100 కి 40 వంతున ఇక్కడనే తయారగునని సూచింపబడినది. తిరుప్పూరు ప్రధానకేంద్రముగ నున్నది. దానికితరువాత పుదుపాలయం గొప్ప కేంద్రముగ నున్నది

13 ఉత్కళరాష్ట్రము కొమభూయిష్ఠమైన దగుటచే దీనికి కద్దరుద్యమము మిగుల ఉపకరించెను.

చిత్తగించితిరా, తంతుకారకసంఘమువా రింత కద్దరు పనిని కొలదికాలములో చేయగలిగిరి. కాని ఆసంఘమువారి కృషికి దేశజనులు తగినంతతోడ్పాటు చేయకపోవుట మిగుల విచారకరము. నేతవృత్తి నవలంబించువారిలో దేవాంగులే ముఖ్యులగుటకు సందియము లేదు వీరు కద్దరు వస్త్రములను తమమగ్గములపై తయారుచేయ నిశ్చయించుచో విదేశవస్త్రబహిష్కారమునకు ఎనలేనిమేలు సలుపగలుగుదురు. ద్వితీయదేవాంగమహాసభ పి. టి. కుమారస్వామి శ్రేష్ఠిగారి

అధ్యక్షతక్రింద గడచిన జూన్ నెలలో కోయంబత్తూరునందు జరిగినది. "నాణ్యాపుసరుకులను నేయువారిని కద్దరునేయునట్లు చేయరాదు." అని వీరు దేవాంగులకు హితబోధ యొనర్చియుండిరి. పూర్వకాలమున యూరపునంతను దిగ్భ్రమజెందించునంతటి సన్నని మజిలీలను డక్కాలో తయారు చేసియుండిన సంగతి చరిత్రజ్ఞానముగలవారికెల్లను విదితమే పూర్వకాలపువస్త్రముల నైపుణ్యము సంగతి ముఖ్యముగ నీక్రింది మూడు విషయములును బోధపర్చగలవు.

1 ఒక మనుష్యునకు సరిపోవు దుస్తంతయు ఒక ముద్దుటుంగరముగుండ దూరిపోవునంతటి సన్నపునూలుతో డక్కాలో మజ్లినులు తయారగుచుండినట్లు 9 వ శతాబ్దమున వచ్చిన అరబ్బీదేశీయుడు వ్రాసియున్నాడు.

2 ఒక పారసీక రాయబారి తనరాజును సందర్శింప వచ్చి నిప్పుకోడిగుడ్డంత పరిమాణముగల కొబ్బరిటెంకను కానుకగ సమర్పించెననియు, దానిని తెరచిచూడగా లోపల అరువదిమూరల పొడవుగల తలగుడ్డ ఇమిడియుండెననియు ట్రవెర్నియరనుఅను నాతడు వర్ణించియున్నాడు.

3 ఔరంగజేబు తనకుమార్తెలు దిగంబరులై రాజస్థానమునకు వచ్చిరని భ్రమపడి వారిని మందలించగా ఒకదానిపై నొకటి ఏడు మజ్లి వస్త్రములను తాము ధరించి

యుంటి మని వారు రుజువుచేసి తమ తండ్రికోపమును చల్లా ర్చిరట. అట్టినైపుణ్యమును మరల బడయుటకు వీళ్లుగలవని కుమారస్వామి శ్రేష్ఠిగారు తెలిసికొనవలసి యున్నారు. శ్రేష్ఠిగారు కావించిన మరియొక అభ్యంతరమునకు సమాధానము చెప్పవలసి యున్నది.

"ఇట్టి నాగరక కాలమునందు మిల్లు సరకులను వదలి చేతి సరకులను గోరుట, అభివృద్ధిని విడచి వెనుకంజవైచుట యగును."

అని వారి యభిప్రాయము. ఇయ్యది సరియైనది కాదు. ఎట్లన (1) చేతిమగ్గములు మిల్లుసరుకులతో పోటీచేయగలవని గవర్నమెంటు నేతనిపుణులు సహితము యిటీవల ప్రకటించి యున్నారు. (2) మిల్లు పరిశ్రమలు ఏకొలదిమంది యైశ్వర్యమునో పెంపుచేయగలవు. అవి జనసామాన్యోద్ధరణ కుపకరింపజాలవు. (3) మరియు, మనము ప్రతి సంవత్సరమును విదేశవస్త్రములనిమిత్తము విదేశములకు బంపు 66 కోట్ల రూపాయలును, మనదేశములో సాలుకు 4 నెలలు పని లేకుండనుండెడి 11 కోట్లమందికి పంచిపెట్టినయెడల తీరిక వేళలలో పనిచేసినందుకు సాలుకు మనిషి 1కి అదనముగా రు 6-0-0 ముట్టును. ఇదియునుంగాక, బట్టల మిల్లులలో 4 లక్షలమందియే పనివాండ్రు గలరు. మిల్లుపరిశ్రమ ఈ కొలదిమందికే యుపకరించును. చేతినూలు పరిశ్రమ పని

లేకయున్న అనేక కోట్లమందికి లాభించగలదు. (5) మరియు మిల్లులలో బట్టలు తయారుచేయుటకగు ఖర్చులో నూటికి 25 వ వంతు మాత్రమే పనివాండ్రకు కూలి ముట్టుచున్నది. కాని కద్దరు తయారగుటకగు ఖర్చులో నూటికి 73 వ వంతున పనివాండ్రకు కూలిక్రింద ముట్టుచున్నది. (6) బొంబాయి మిల్లులలో జరుగుచున్న సమ్మెకట్టులనుజూడ మిల్లు పరిశ్రమ విషయమున నిరాశ జనింపకమానదు. ఈ కారణములవలన శ్రీశాస్త్రిగారి మిల్లు పరిశ్రమాభిమానము నిష్ఫ్రయోజనమని రుజు వగుచున్నది.

ఈ విచారణనుబట్టి తేలిన సారాంశ మేమనగా, ఈ దేశముయొక్క ఆర్థికసమస్య కద్దరుమీద నాధారపడినంత నిక దేనిమీదను ఆధారపడలేదని రుజు వగుచున్నది. ఆర్థిక సమస్యాపరిష్కారము కుదిరినచో రాజకీయసమస్య దానియంతట నదియే పరిష్కార మగునని నేను ఆదిలో మనవిచేసియుంటిని. కాన నారీమణులారా! మీ రందరును కద్దరువస్త్రములను ధరింపుడు. మీ పురుషులు కద్దరునే ధరించునట్లు ప్రోత్సాహపరచుడు. విదేశవస్త్రములను బహిష్కరించుడు. తా మీ పనులు నెరవేర్చినచో, రాబోవు డిశంబరు 31 తేది రాత్రి 12 గంటలకు స్వరాజ్యము తప్పక సేకూరునని సవినయముగ విన్నవించుచు నింతటితో విరమించుచున్నదానను.

## తీర్మానము.

"భారతదేశముయొక్క ఆర్థికసమస్యా పరిష్కారమును రాజకీయ విముక్తియును, కద్దరు మీదనే ఆధారపడి యుండు టచే, అట్టికద్దరు వ్యాప్తికై భారతతంతుకారక సంఘమువారు కావించుచున్న కృషికిని, దేశీయ కాంగ్రెసు మహాసభవారు చేయుచున్న ప్రయత్నములకును, పురుషులతోపాటు స్త్రీలును విధిగా తోడ్పడవలయునని కోరుచు, సత్వరస్వాతంత్ర్యము నపేక్షించు ప్రతిభారతరమణియు, ముఖ్యముగ ఆంధ్రనారీ మణులెల్లరును నూలువడుకుట స్వదేశఖాదీవస్త్రములను ధరించుట దీక్షగా నవలంబించ వలెనని ఈసభవారు సవిన యముగ ప్రార్థించుచున్నారు."

నారీమణులారా! తమ యంగీకారమును పడయు టకై ఈ తీర్మానమును తమ సమక్షమున ప్రవేశపెట్టుచు న్నాను. ఈతీర్మానమునందు పేర్కొనబడిన ఆర్థిక తత్వ మునుగూర్చి నా యుపన్యాసమునందు వివరముగా ముచ్చ టించి యున్నాను. కాన, ఎట్టి భేదాభిప్రాయమునకును తా వీయక, అందరును అంగీకరించ వలెనని కోరుచూ తీర్మాన ము నుపపాదించుచున్నాను.

ఓం తత్సత్.



శ్రీమతి కాకరపర్తి జ్ఞానప్రసూనాంబగారు.

(వయస్సు - 15 సంవత్సరములు)

నెం. 2 రు.

ఆంధ్రమహిళాసభ,

బెజవాడ.



# కద్రుతిర్గ్రానము

(రాజకీయ, ఆధ్యాత్మిక తత్వములు.)



ఆమోదకురాలు:

కాకరపర్తి జ్ఞానప్రసూనాంబ.

తూనుగుంట్ల రామస్వామి గుప్తగారి

జ్యేష్ఠ పుత్రిక



ఓమ్.

విదుషీమణులారా!

కద్దరునుగూర్చి నేడు మీ సమక్షమున నేను ఉపన్య సింపబూనుట కడుసాహసము, మీలో ఎందరో మహనీయు రాండ్రును, విజ్ఞానసంపన్నులును కద్దరుద్యమమున అనుభవ వేత్తలును అనేకులుండగ, ఈవిషయములలో మిగుల కొరత వడియున్న నావంటిదానను లేచి ప్రసంగ మొనర్పదలచుట యొక్కయుద్దేశ్యము, కద్దరునందు నాకుగల అభిమానమును వెల్లడించుటకు తప్ప అన్యముకాదని మనవి చేయుచున్నాను. మరియు మీవంటి విదుషీమణుల యొక్కయు, ప్రఖ్యాతి వహించిన దేశసేవకురాండ్ర యొక్కయు, దర్శనభాగ్యమును పొందుటకే; నే నీయుపన్యాసవ్యాజమున సభావేదిక నెక్క దలచితిని.

"యత్సారభూతం, తదుపాసితవ్యం
హంసో యథా క్షీర మివాంబుమిశ్రం."

పాలును నీళ్లును కలిసియున్నప్పుడు, నీళ్ళనువిడచి పాలనే గ్రహింపశక్తిగల హంసలమాడ్కి తాము, గుణ దోషమిశ్రితమైన నాయుపన్యాసమునందలి అపారము లైన దోషములను మన్నించి, సారభూతములైన గుణములను

గ్రహించి నన్ను కృతార్థత నొందింప ప్రార్థించుచున్నదా నను. ఈ క్రియకే హంసక్షీరన్యాయ మని పేరు.

కద్దరుయొక్క రాజకీయ అధ్యాత్మికతత్వములను గూర్చి నే నిప్పుడు ఉపన్యసింపవలసి యున్నాను. అందులో ముందుగ రాజకీయవిషయము చర్చింపబడవలసి యున్నది. కద్దరుయొక్క ఉత్పత్తివిక్రియములవలన మనదేశమునకు స్వరాజ్యము తప్పక వచ్చు నని అనేకరాజకీయపరిజ్ఞాతలు ఇప్పు డిప్పు డంగీకరించు చున్నారు. సాలుకు డెబ్బదికోట్ల రూపాయలు విదేశములకు పోనీయకుండ చేయగల ఒక అపూర్వమైన మహాశక్తి రాట్నపు పరిశ్రమవలన మనదేశ జనులకు అలవడుచున్నది. ఇట్టిపనికై మన మిదివరలో అన్యులమీాద నాధారపడియుంటిమి. కాని యిప్పుడు మనము స్వతంత్రశక్తిని రాట్నపు పరిశ్రమాభివృద్ధివలన సంపాదింప గలుగుచున్నాము. ఎంతకాలము ప్రజలు శక్తిహీనులుగ నుందురో అంతకాలము వారు పరాధీనులే. ఏనాడు శక్తిని సంపాదించెదరో ఆనాడే స్వరాజ్యము ననుభవించెదరు. అన్నము, వస్త్రము, ఈరెండును కొరతలేక యుండుట ప్రతిదేశములోను ఆదేశజనులయొక్క ప్రాతిపదిక హక్కులై యున్నవి. అట్టిహక్కులను సంపాదించుకొనుటకై మనము మన స్వశక్తిమీాద నాధారపడగలిగినప్పుడే మనము రాజకీయదాస్యము

నుండి విముక్తులము కాగలము. మన దేశముయొక్క రాజకీయవిముక్తికి పాటుపడుచున్న సంస్థలు అనేకములు గలవు. కాని వీనియన్నింటిలోను అఖిలభారతకాంగ్రెసు మహాసభయే ముఖ్యమై యున్నది. ఈ సభకీ సంవత్సరము మోతేలాల్ నెహ్రూగారు అధ్యక్షులు. వీరికృషికి తోడ్పడుటకై భారత జాతీయ కాంగ్రెసు వర్కింగు కమిటీ యొకటిగలదు. ఈ కమిటీ వారు విదేశవస్త్రబహిష్కరణమూలమున స్వదేశవస్త్రదీక్షను వ్యాపింపచేయగోరుచున్నారు. అందుకు వారొక కార్యక్రమమును నిర్ణయించిరి. ఎట్లన?

1. కాంగ్రెసుసంస్థ లన్నియు స్వచ్ఛందసేవకులను స్త్రీపురుష భేదము లేకుండ చేర్చుకొని, వారి నింటింటికి బంపి విదేశవస్త్రములను పోగుచేసి, వారికి వలయు కద్దరువస్త్రములను సరఫరా చేయుటకు ప్రయత్నించవలెను.

2. పోగుచేయ బడిన విదేశవస్త్రముల నన్నింటిని బహిరంగముగ దహన మొనర్చ వలెను.

3. విదేశవస్త్ర వర్తకుల కడకేగి వారి నిటుపైన విదేశవస్త్రములను తెప్పించకుండ కోరవలెను.

4. దౌర్జన్యము జరుగదని తోచినయెడల సాధ్యమగు స్థలములందు విదేశవస్త్రవిక్రయనిరోధము గావింపవలెను.

5. వారం వారమునకు కాంగ్రెసు సంస్థలన్నియును కేంద్రాలయమునకు బహిష్కరణోద్యమవివరములను తెలియపరచవలెను.

6. బహిష్కరణోద్యమమునకు, రాజకీయ, పారిశ్రామిక, కార్మిక, తదితరసంఘములన్నిటియొక్క సహాయమును పొందుటకు ప్రయత్నించ వలెను.

7. కద్దరు ఎచ్చట అవసరమై యుండునో ఆస్థలములందు కద్దరు వస్త్రాలయములను క్రొత్తగ స్థాపించవలెను.

8. విదేశవస్త్రబహిష్కరణసంఘము నేర్పరచి ధనమును వసూలు చేయవలెను.

9. రాష్ట్రీయశాసనసభలయందును, కేంద్రశాసనసభలయందును ప్రభుత్వమువారు కద్దరునే కొనవలెనని తీర్మానములు గావింపవలెను.

10. విదేశవస్త్రములపై పన్ను నధికము చేయవలెనని తీర్మానములు గావింపవలెను.

ఈ ప్రకారము కార్యక్రమమును సాధించవలెనని అఖిలభారత విదేశవస్త్రబహిష్కరణ ప్రచారక సంఘకార్యదర్శిగారైన, జయరామ్‌దాస్ దౌలత్‌రామ్‌గారు ప్రకటించియున్నారు. మరియు 8 గంటలు వరుసగా పనిచేసినచో నెం

12 రు మొదలు నెం 20 రు నూలు 16 వేల గజముల దార మును తీయగల రాటమును తయారుచేయువారికి ఒక లక్ష రూప్యముల బహుమతియీయబడునని మహాత్మా గాంధిగారు ప్రకటించియున్నారు. ఈరాట్ననిర్మాణమువలనను పైనతె ల్పిన బహిష్కరణకార్యక్రమసాధనమువలనను భారతీ యులు తమదేశవిముక్తిని సంపాదింపవలసియున్నారు.

దేశవిముక్తిని ఈప్రకారము ప్రజలు తమ స్వశక్తి మీద నాధారపడి సాధింపవలెనుగాని, సర్కారువారి దయా దాక్షిణ్యములమీదను, పార్లమెంటుసభ్యులమీదను ఆధార పడిన ప్రయోజన ముండనేరదు ఇంగ్లండులోని వివిధరాజకీ యపక్షములవారికి ఇంపీరియల్ మతము ఆవహించియున్న టుల స్పష్టమగుచున్నది. మొన్నజరిగిన పార్లమెంటు ఎన్నిక లనుజూడ, వీరిలోనే పక్షమువారికిని భారతీయులకు స్వేచ్ఛ నొసగుపట్ల పట్టుదల లేదని గ్రహింపవచ్చును. లేబరుపక్షము వారుగూడ నిట్టి లక్ష్యమునే పెట్టుకొనియున్నటుల లేబరు పక్ష తీవ్రవాదులని పేరువడసిన స్నోడన్ గారి ప్రసంగము తెలుపక నే తెలుపుచున్నది. కాన దేశజను లిట్టి రాజకీయవేత్తలపై నాధారపడక, మహాత్మాగాంధిగారి కద్దరు హితోపదేశమును పాటించుట పాడి యగును. ఆయన యుపదేశించు కద్దరుమహా మంత్రము నోఛేంజర్లతో పాటు సంపూర్ణస్వాతంత్ర్య

వాదులు, అధినివేశస్వాతంత్ర్యవాదులు, స్వరాజ్యవాదులు, లిబరల్ వాదులు, మితవాదులు, జస్టీసుపక్షమువారు, బ్రాహ్మణపక్షమువారు, బ్రాహ్మణేతరపక్షమువారు, ఉద్యోగులు, నిరుద్యోగులు, ఉత్తరదేశీయులు, దాక్షిణాత్యులు, స్త్రీలు, పురుషులు మున్నగు తారతమ్యములేక అందరకును అవశ్యాచరణయోగ్యమైయున్నది.

కాని కొందరి కింకను కౌన్సిళ్ల వ్యామోహము తీరలేదు. ఉద్యోగవాంఛ తరుగలేదు. ప్రశాంతమైన నిర్మాణకార్యక్రమమున బుద్ధి నిలుచుటలేదు. స్వదేశవస్త్రదీక్షలో నమ్మకము కుదురలేదు. ఈ కారణములచేతనే స్వరాజ్యవాదులింకను యమ్. యల్. సీ. లకొరకు పెనగులాడుచున్నారు. శ్రీనివాస అయ్యంగారివంటి సంపూర్ణస్వాతంత్ర్యవాదులు సహితము మంత్రిపదవులకై మంత్రాలోచనలు కావించుచున్నారు. ఇకను మితవాదులసంగతి వేరుగ చెప్పనక్కరలేదు. మహజర్లు, పిటీషనులు, రాయబారములు మున్నగు సన్నాహములతో బయలుదేరి గవర్నమెంటు గృహముఖద్వారముల యొద్ద చేతులు జోడించుకొని నిలువుజీతములు పుచ్చుకొనవలెనని చెప్పుచు, తమ ప్రాతపద్ధతినే పట్టుకొని వ్రేలాడుచున్నారు. హిందువులకు శ్రావణబహుళ అష్టమినాడు ఉట్లపండుగ (కృష్ణాష్టమి) వచ్చును. కాని స్వరాజ్యవాదు

లకు ఉట్లపండుగపోయి ఓట్లపండుగ వచ్చినది. ఆదినమున వారికి ఎక్కడలేని ఉల్లాసము, సంతోషము. "అయ్యా, వోటీయండి, అమ్మా! వోటుభిక్ష పెట్టండి" అని యీవిధముగ పురవీధుల ప్రవేశించి గృహవాకిళ్ళలో జొరబడి సంభావన బ్రాహ్మణులవలె యజమానులను బాధించే బాధ వర్ణనాతీతము. ఈ బాధపడలేక వోటర్లు తమ యింటికివచ్చి అడిగిన ప్రతిఅభ్యర్థికిని "నావోటు నీకే. నావోటు ముమ్మాటికి నీకే" అని చెప్పి తుదకు పోలింగునందు వేరొకనికి వోటిచ్చుటయో లేక తాను మొగమును తప్పించుటయో జరుపు చున్నారు. ఈయెలెక్షనులో ప్రతి అభ్యర్థికి అయిదారువేల రూపాయలకు తక్కువ లేకుండ ఖర్చు అగుచున్నది. ఇంతధనమును, కాలమును, శక్తిని కద్దరుత్పత్తివిక్రియములమీదను వినియోగించినచో ఎంత ప్రతిఫలము కలుగక యుండును? రాటం పట్టుకుంటే రాజ్యం వచ్చునా? అని యింకను అనేకులు పరిహాసించుచున్నారు. ఈసంవత్సరము జూన్, జూలై, ఆగష్టు ఈమూడు నెలలలో కద్దరుఉద్యమము తీవ్రముగ జరిగియుండుటచే లాంకషైరు మిల్లులకు ఒక కోటిరూపాయల నష్టము ప్రాప్తించినదని ఆంగ్లవార్తాపత్రికలు ప్రకటించియున్న సంగతి తమ రెరింగియేయున్నారు. మరియు టోరీపార్టీ విధానమున కొద్దికాలము పరిపాలన జరు

గుచో ప్రభుత్వమువారు భారతదేశమును కోల్పోవవలసివచ్చు నని బ్రిటీషుయుద్ధమంత్రిగారయిన టాంషాగారు తెలుపు చున్నారు.

రాట్నపరిశ్రమము ఆంగ్లేయరాజ్యాంగవేత్తలకు సింహాస్వప్న మగుచుండగా, కాంగ్రెసువాదులు కొందరు, కద్దరునందు నిరాశజెంది, శాసనసభల కెగబ్రాక ప్రయత్నించు చుండుట బహుచోద్యముగ నున్నది. వంగరాష్ట్రకాంగ్రెసు కమిటీ కార్యదర్శియగు కిరణశంకరరాయ్‌గారు ఆనందబజారు పత్రికలో నొక యాదాస్తును ప్రకటించిరి. ఎట్లన?

"రాబోవు లాహోరుకాంగ్రెసుసభయందు సంపూర్ణ సహాయనిరాకరణము అవసరమని తీర్మానింపబడేయెడల శాసన సభాసభ్యత్వము ప్రయోజనకరమని భావించెడు ప్రాతస్వరాజ్యపార్టీని, పునరుద్ధరించుటకు గట్టిప్రయత్నములు చేయవలసి వచ్చును." అని వారు ప్రకటించిరి. కాంగ్రెసుకౌన్సిలు పార్టీనాయకుడగు జె. యన్. సేన్ గుప్తగారు పైప్రకటనను ఖండించుచు నిట్లు ప్రత్యుత్తరమిచ్చిరి. "అమలులో నున్న ప్రభుత్వచక్రము నంతటిని స్తంభింపజేయుటకై సహాయ నిరాకరణాస్త్రమును ప్రయోగించుటకు దేశమంతయు ఒక్కుమ్మడిగా నడుములు బిగించవలసిన ఆతరుణములో, ఏవో కొన్ని అధికారపదవులను సంపాదించి వశపరచుకొనవలెనని

వంగరాష్ట్రములోని పురుషపుంగవులు భావించుచున్న దేశ బంధువైన సి. ఆర్. దాసుగారి ప్రతిష్ఠను భంగపరచిన వారమగుచున్నాము." అని సెలవిచ్చిరి. ఈ వాక్యములు కౌన్సిల్ ప్రవేశవాదుల వ్యామోహమును పటాపంచలు సేయగలవనుటకు సందియములేదు. ఈచర్చనుబట్టి గ్రహింపవలసిన దేమనగా, కద్దరును విడిచిపెట్టి జరుపు యేరాజకీయోద్యమముగాని హిందూదేశదాస్యమును తొలిగించ జాల దని స్పష్టపడుచున్నది.

ఇంతవరకు కద్దరునం దిమిడియున్న రాజకీయతత్త్వమును విమర్శించితిని. ఇకను రాట్నమునందుగల ఆధ్యాత్మికతత్త్వమును తెలిసికొనవలసి యున్నాము. మానవునకు తరణోపాయము లనేకములు గలవు. కర్మయోగము, భక్తియోగము, జ్ఞానయోగము, ధ్యానయోగము యీ నాలుగు యోగములలో దేనిచేతనైనను ఆత్మను సాధింపవచ్చును. కాని వీనిలో ధ్యానయోగమే శ్రేష్ఠమైనదని తత్త్వవేత్తలు తమ యనుభవమును వెల్లడించి యున్నారు.

"ధ్యాననిర్మథనాభ్యాసా త్సాక్షా త్పశ్యతి మాం జనః."

అనగా ధ్యానమును అభ్యాసము చేయుటవలన, నన్ను సాక్షాత్తుగ చూడగలరు. అని అర్థము. అందులో ప్రణవధ్యానము అపరోక్షానుభూతికి సాధనభూతము.

"ఏత దాలంబనం శ్రేష్ఠ మేత దాలబనం పరమ్
ఏతదాలంబనం జ్ఞాత్వా బ్రహ్మలోకే మహీయ తే."

ఓంకారమే మోక్షమార్గమునకు శ్రేష్ఠమైన సోపానము. దీనిరహస్యమును తెలిసినవాడు బ్రహ్మలోకము నొందును. అని కఠోపనిషత్తు ఇందుకు ప్రమాణము.

ప్రణవధ్యాన మనగా, జిహ్వా, కంఠము, హృదయము వీనియం దెంతమాత్రము చలనము కలుగకయే, మూలాధారమునుండి సహస్రారమువరకు తదేకరూపముగ ఓమ్, ఓమ్, ఓమ్, అను నాదమును మానసికముగ చేయుచు మనసును ఆనాదమున లయమొనర్చి, తాను తానుగానే నిలిచిపోవుట అనగా తన్మయత్వము నొందుట. ఈనాద మెట్లుండుననగ, దేవాలయములో మనము పెద్దగంటను కొట్టినప్పుడు ఓ-ఓ-ఓమ్ అను నాదము తైలధారవలె తెంపులేక యుండునట్లుండును.

"తైలధారా మివాచ్ఛిన్నం, దీర్ఘఘంటానినాదవత్,
అవాచ్యం ప్రణవస్యార్థం యస్తం వేద స వేదవిత్॥"

అని ఓంకారనాదముయొక్క స్వరూపము శాస్త్రములో నిర్ణయింపబడినది. ప్రణవ మొకమహామంత్రమగుట

యేగాక, అయ్యది సర్వమంత్రములకును, ప్రాణాధారమై ఉత్తమమై యున్నది. ఎట్లన్నః

"సర్వేషాం చైవ మంత్రాణాం ప్రణవః ప్రాణ ఉచ్యతే."

మరియు,

"ఓంకార స్సర్వమంత్రాణా ముత్తమః పరికీర్తితః."

అని ప్రమాణములు కలవు. ఓంకారధ్యానము సంసార బంధములనుండి తొలగించి, ఉపాసకులకు ఆత్మసిద్ధిని కలిగించును. మనము రాట్నమును ద్రిప్పుటచే ఓం,ఓం, ఓం అను ప్రణవఝుంకారము మన శ్రవణేంద్రియమునకు సర్వదా వినబడి ఒకవిధమైన హాయిని కలుగజేయుననుట ఎల్లరకును, తెలిసిన విషయమే. ఇట్లు పదేపదే రాట్నమును ద్రిప్పుటవలన అనేకావృతులుగ ప్రణవధ్వని మన మనసునకు తగులుచు, మనస్సు నిర్విషయమై, చిత్తము వృత్తిరాహిత్యమై ఆత్మయందు విలీనమగును. ఇదియే కైవల్యసిద్ధి. కాన రాట్నపరిశ్రమను శ్రద్ధతో జరుపువారికి ఇహలోకసంబంధమైన ఆర్థికలాభమేగాక, పరలోకసంబంధమైన ఆత్మసిద్ధికూడ కలుగును

నూలువడకుట బహుకాల మభ్యసించినయెడల, ఆసనసిద్ధి కుదురును. దీనివలన హృదయమునకు నిశ్చలత్వమును నిర్మలత్వమును కలుగును. నాడీశుద్ధికూడ ప్రాప్తించును. మరియు వడుకుచున్న దారమునందే చూపును లీన మొనరె

నచో ఏకాగ్రత కలిగి లక్ష్యసిద్ధికి హేతు వగును. ఒకేపనియందు దీక్షవహించి యుండుటవలన మౌనవ్రతము సిద్ధించును. కాన రాట్నము ద్రిప్పుటచే మనకు (1) ఆసనసిద్ధి (2) మౌనసిద్ధి (3) లక్ష్యసిద్ధి ఈ మూడును కలిగి తద్వారా (4) ఆత్మసిద్ధియును ప్రాప్తించు చున్నపుడును, ఇహలోక జీవితయాత్ర కనువగు ఆర్థికసిద్ధి తటస్థించుచున్నప్పుడును రాట్నము ఉభయతారకము కాజాల దని ఎవరు చెప్ప సాహసింతురు ? ఈ విచారణవలన కద్దరునందు ఆధ్యాత్మికతత్త్వము ఇమిడియున్నట్లు నిరూపించి యున్నాము.

కద్దరుయొక్క ఆర్థిక రాజకీయ తత్త్వములతో మాకు పని లేదనియు, పారమార్థికతత్త్వమే మాకు విశ్వాసపాత్రమనియు, వాదించుచున్న పూర్వాచారపరాయణులు, పైన తెల్పిన ఆధ్యాత్మికతత్త్వమును రాట మునందు చూడగల్గియు, కద్దరుధారణమునకు వా రేల విముఖులైయున్నారో సమాధానము చెప్పవలసియున్నారు. "వేదములో యుంటేగాని, ధర్మశాస్త్రము శాసిస్తేగాని, పురాణం బోధిస్తేగాని, శిష్టు లాచరిస్తేగాని మేము కద్దరును తాకము" అని పూర్వాచారపరాయణులు గర్జించుచున్నారు గదా! ఈక్రింది శాస్త్రప్రమాణములను గమనింప నింతు.

1. సర్వోత్కృష్టమైన బ్రహ్మవిద్యను వేదాంతులు బ్రహ్మసూత్రములవలన సాధించినట్లు అతిసున్నితములైన వస్త్రములను పూర్వము తంతుకారులు కార్పాససూత్రముల వలన సాధించిరి. జ్ఞానతంతువులతో ఆత్మను పరిష్కరించి అజ్ఞానతమస్సును తత్త్వజ్ఞానులు పోగొట్టుచందమున, వస్త్రములతో దేహము నలంకరించి తంతువాయులు మానమును కాపాడుచుండిరి. వేదములు పుట్టినప్పుడే దారము పుట్టినది గాయత్రికి బ్రహ్మసూత్రమని పేరు. దారముతో చేసిన జంధ్యమునకు యజ్ఞసూత్రమని పేరు. ద్విజుడు గాయత్రీప్రతిపాదక బ్రహ్మసూత్రమును హృదయకమలమున ధరించినట్లు యజ్ఞదీక్షా ప్రతిపాదకమైన భుజస్కంధమున ధరించి తన ద్విజత్వమును ప్రకటించుచున్నాడు. వేదములో ఓత - ప్రోత - శబ్దములు పడుగు పేకల కుపయోగించి యున్నారు.

"నాహం తంతుం నవిజానా మ్యోతుం
న, యం, నయంతి, సమరేఽతమానాః."

—ఋగ్వేదము.

అనగ, అహం తంతుం న విజానామి=నేను పడుగును చేయుట తెలిసికొన లేదు. న ఓ తుం = పేకను తయారు చేయుట తెలిసికొన లేదు. సమరే అతమానాః = స్పర్థ

చేసెడివారు, యం వయంతి = దేనిని చేయుచున్నారో దానిని, న = తెలిసికొనుట లేదు. మరియు,

"స ఇ తంతుం స విజానా త్యోతుం
స వక్త్వా న్యృతుధా వదాతి."

అనగ సః ఇత్ తంతుం విజానాతి = వాడు నిశ్చయముగ పడుగుచేయుట తెలిసికొనుచున్నాడు. మరియు వాడు ఋతుధా = సత్యముగ, వక్త్వాని వదాతి = భాషణము చేయుచున్నాడు. మొదటి మంత్రములో వర్ణింపబడిన తెలియని వాడు, రెండవ మంత్రములో వర్ణింపబడిన తెలిసినవానియొద్దకు వెళ్ళి, వానికి శిష్యుడై తంతువాయువిద్యను నేర్చుకొనుచున్నాడు. అని తాత్పర్యము. వస్త్రములు నేయువిద్య, ఈ ప్రకారము వేదకాలమునుండియు గురుశిష్యపరంపరగ వచ్చుచున్నట్లు అర్థము సువ్యక్త మగుచున్నది.

2. వేదకాలమున స్త్రీలకు శిశుపోషణ, నూలువడికి వస్త్రములు నేయుట ఈ రెండును ముఖ్యధర్మములై యుండెను.

3. ఆకాలమున గృహయజమానులగు తల్లిదండ్రులు తమబిడ్డలకు వస్త్రములను నేసి యిచ్చుచుండిరి.

4. ఆకాలమున దేశభక్తులగు వారు తమ యన్నవస్త్రములను తామే స్వయముగ చేసికొనవలెనని విధియుండెను. కాని పరుల నాశ్రయించి యుండలేదు.

5. మరియు యజ్ఞముకొరకును, సంస్కారముకొరకును, ధర్మవిధికొరకును, సామాజిక, రాజకీయ మహోత్సవముల కొరకును ఆర్యులు భిన్నభిన్న వస్త్రములను ధరించెడివారు. ఇప్పటికాలపు శ్రోత్రియు లేకారణముననో సర్వావసరముల యందు 1702 నెంబరు మ్యాంచెష్టరు మల్లుతప్ప యితర వస్త్రమును తాకుట లేదు.

6. స్త్రీలు తమభర్తలకు స్వయముగ వస్త్రములు నేసియిచ్చినట్లు వేదమున ప్రమాణములు గలవు.

వేదప్రమాణము లిట్లుండ మన ధర్మశాస్త్రములలో కూడ ఆకాలమున గౌరవకుటుంబస్త్రీలకు సహితము వడుకుట, నేయుట జీవనోపాధివృత్తిగా నుండెను. భార్యకు జీవన మేర్పాటుచేయక భర్త దేశాంతరగతుడైనప్పుడు భార్య నూలువడికి జీవింపవలెనని మనుస్మృతి బోధించుచున్నది.

7. "విధాయ ప్రోషితే వృత్తిం జీవే న్నియమమాస్థితా
ప్రోషితే త్వవిధాయైవ జీవే చ్ఛిల్పై ర గర్హితైః."

—మనుస్మృతి. IX అ 75 శ్లో.

ఈశ్లోకమునకు కుల్లూకభట్టాచార్యులు ఇట్లు వ్యాఖ్యానమును వ్రాసియున్నాడు.

"భక్తాచ్ఛాదనాది దత్వా, పత్యౌ దేశాంతరగతే,

దేహాప్రసాదనపరగృహగమనరహితా జీవేత్ - అదత్వా పునర్గతే సూత్రనిర్మాణాదిభి రనిందితశిల్పేన జీవేత్."

అన్నము వస్త్రము మొదలగునవి యొసంగి భర్త దేశాంతర మేగెనేని, భార్య వంటికి అలంకారములుచేసికొనుట, పొరుగిండ్లకేగుట ఈ పనులను విడచి జీవింపవలెను. అట్లు తన కేదియు నొసంగక భర్త దేశాంతరమున కేగునేని నూలువడకుట మున్నగు గౌరవవృత్తులచేత జీవింపవలెను.

"సూత్రనిర్మాణాదిభిః."

అని వ్యాఖ్యానకారుడు వ్రాసినప్పుడు నూలువడకుటయే అని స్పష్టార్థము.

8. భార్యయొక్క నిత్యకృత్యములలో వడకుట, నేయుటకూడ యున్నట్లు వాత్స్యాయనఋషి కామసూత్రములలో భార్యాధికరణమున తెలిపియున్నాడు. ఎట్లన.?

"భోజనావశిష్టాద్గోరసాద్ఘృతకరణం, తథా తైలగుడయోః। కార్పాసస్యచ, సూత్రకర్తనం, సూత్రస్యచ, వానం। దైవసికాయ వ్యయ, పిండీకరణ మితి విద్యాత్ ॥"

అనగ, భోజనసమయమం దుపయోగించగా మిగిలిన గోరసము (వెన్న) నుండి నేతినిచేయుట, అటులనే నూనె, బెల్లమును తయారుచేయుట ప్రత్తినుండి దారమును వడు

కుట, ఆ దారముతో వస్త్రములు చేయుట, దినచర్యయందు ఆదాయవ్యయములను చేర్చుట వీనిని భార్య తెలిసికొన వలెను. అని అర్థము.

9. తన కుమార్తె వివాహకాలమున కన్యాదాత, అల్లునకు దీక్షావస్త్రములను సమర్పించు ఆచారము కలదు. వరునకీ వస్త్రదానము మధుపర్కపూజాకాలమున శిష్టులు జరిగించుచున్నారు.

"మయా క్రియమాణకన్యాదానాంగత్వేన
వరం మధుపర్కేణ పూజయిష్యే."

అని కన్యాదాతయొక్క సంకల్పానంతరం క్షౌమవస్త్రదానము జరుగుచున్నది. ఈ దీక్షావస్త్రములకు యజ్ఞవస్త్రములనియు పేరుగలదు. వివాహమనునది, ఒక మహాయజ్ఞము, అట్టి యజ్ఞకాలమున నీయబడుటచే వీనికి యజ్ఞవస్త్రము లని నామం బిడిరి. ఈ యజ్ఞవస్త్రములు మగ్గముల మీద చేతితో నేయబడినవిగా యుండవలె నని విధి కలదు. 'యజ్ఞస్య పేశః' అని వేదమునందు కలదు.

"సాధ్వపాంసి, సనతానఉక్షితే, ఉషాసానక్తా వయ్యేవ, రణ్వితే, తంతుం తతం, సంవయన్తీ, నమీచీ యజ్ఞస్య పేశః, సుదుఘే పయస్వతీ." —ఋగ్వే. 2 అధ్యా.

అనగా వస్త్రములను తయారు చేయుటకు వ్యాపించి యున్నటువంటి మార్గమును, కలసిమెలసినేయు సాలెస్త్రీలవలె ఉత్తమక్షీరమునిచ్చెడి ఆనందదాయకమైన, ఉదయస్త్రీయు ను, సాయంకాల స్త్రీయును మాకొరకు ఉత్తమకార్యముల ను చేయుచున్నారు ఇట్టి దీక్షావస్త్రములను వధూవరులు ఒక రికొకరు ప్రేమసూత్రములచే తయారు చేయుచుండెడివారు.

"వాసో యత్పత్నీభి రుతం తన్నః

స్యోనముపస్పృశాత్." —అధర్వణ వేదము.

అనగ ఏది భార్యచేసినవస్త్రి మగుచున్నదో ఆవ స్త్రము మాకొరకు శుభదాయకమగు గాక! అని భర్త చెప్పు చున్నాడు. దీనినిబట్టి వివాహకాలమున భర్త ధరించవలసిన దీక్షావస్త్రములు భార్యచే తయారుకాబడనియెడల అమంగ ళము సేకూరునని అర్థము స్ఫురించుచున్నది. తన భర్తకొరకు వస్త్రములను నేయు పతివ్రత తన హృదయమందలి ప్రేమ సూత్రములతో మెదిపి నేయుచున్నది. దీనివలన సతీపతుల పరస్పరప్రేమ వర్ధిల్లుచుండును. ఈ కాలమున వివాహము జరుపుకొనుచున్న వధూవరులలో ఎందరు ఈప్రకారము రాట్నపు నూలును స్వహస్తములతో తయారుచేసి తమ ప్రియులకు దీక్షావస్త్రములను నేసియిచ్చి వైదికధర్మమును నిలువబెట్టుచున్నారో తెలియదు.

ఆ కాలమున వడుకుట సాధారణమైన చేతిపని యైన ను, అయ్యది బహుపవిత్రమైన కార్యముగ నెంచబడుచు వచ్చెను. ఎట్లన?

1. శ్రీమహావిష్ణువునకు, సుతంతువనియు, తంతువర్ధను డనియు నామములు గలవు.

2. కవి అగ్ని దేవుని ఆవాహనము చేసినప్పుడు పురాతన తంతువును వడుకవలసిన దని ప్రార్థించినాడు.

3. జీవితము సాగుటయును, మానవజాతి నిరంతర ముగ పెంపొందుటయును బాగుగ వడికిన దారముతో పోల్చి నారు.

4. తండ్రులు తమవంశము అంతరింపక పరంపరగా సాగుటను, వడికిన దారముతో పోల్చి తెలిపినారు. ఎట్లన?

"ప్రజా తంతుం మా వ్యవ త్సేత్సీః."

అనగా సంతానసూత్రమును త్రెంపవలదు. అని పలికిరి.

5. అధర్వణవేదములో తలగుడ్డ ఉష్ణీషమని పిలువ బడెను.

6. తైత్తిరీయబ్రాహ్మణములో సువర్ణవస్త్రము ఉదహరింపబడెను.

7. ఋగ్వేదములో మరుత్తులు బంగారు పోదిగిన వస్త్రములను ధరించినట్లు వర్ణింపబడియున్నది.

(8) భాగ్యవంతుల సన్నని ధోవతులు ప్రావారములని పిలువబడుచుండెను.

9. స్త్రీలు మొలను ధరించుదానికి అంతరీయమనియు, పైన మేలిముసుగుగా వేసికొనుదానికి ఉత్తరీయమనియు పేర్లు.

10. దేవతార్చనలయందును, స్త్రీల నోములు వ్రతములయందును, ఉపాసకులు తమ ఇష్టదేవతలకు జరుపు షోడశోపచారపూజలందును అర్పించు వస్త్రములు, సువర్ణ వస్త్రము లనియు, బంగారు వన్నెగలవనియు, తమచే తయారు చేయబడినవనియు అర్థముగల మంత్రమును చెప్పుదురు. ఎట్లన.

"స్వర్ణాంచలం, స్వర్ణవిచిత్రశోభితం, కౌశేయ యుగ్మం, పరికల్పితం. మయా।
దామోదర! ప్రావరణం గృహాణ మాయాచలప్రావృత దివ్యరూపం"

అని మంత్రమును జెప్పి, "వస్త్రయుగ్మం సమర్పయామి" అని వస్త్రోపచారమును గావించెదరు.

**11.** ఇటులనే యజ్ఞోపవీతోపచారము సల్పునపుడు ఆ యజ్ఞోపవీతము సువర్ణతంతువులచే, చేయబడినదనియు, ముత్యములతో, రత్నములతో కూర్చబడినదనియు అను అర్థమును బోధించు మంత్రమును చెప్పుదురు. ఎట్లన?

సువర్ణతంతూద్భవ యజ్ఞసూత్రం, ముక్తాఫలస్యూత మనేకరత్నం.।
గృహాణ తద్వత్కృత ముత్తరీయం, స్వకర్మసూత్రం, ధరతే నమోస్తు॥

అని యజ్ఞోపవీతోపచారమును గావించెదరు.

(12) ఇవిగాక, స్త్రీలు వరలక్ష్మీవ్రతము మున్నగు నోములు సల్పునపుడు పూజానంతరమునను, వాయనదానమునకు పూర్వమును, తోరగ్రంథిపూజ గావించి, తొమ్మిది ముళ్లువేసిన తోరములను తమహస్తమున ధరించెదరు. ఆసూత్రము స్త్రీలు స్వయముగ తయారుచేసిన నూలుతో నిర్మింపబడును. అట్టి సూత్రధారణమువలన స్త్రీలకు శుభమును, పుత్రపౌత్రాభివృద్ధితోగూడిన సౌభాగ్యమును సేకూరు నట.

(1) కమలాయై నమః - ప్రథమగ్రంథింపూజయామి.

... ... ... ...

(9) హరివల్లభాయై నమః — నవమగ్రంథిం పూజయామి.

ఈప్రకారము తొమ్మిది ముళ్లు పూజించి,
"బధ్నామి దక్షిణే హస్తే నవసూత్రం శుభప్రదం
పుత్రపౌత్రాభివృద్ధించ, సౌభాగ్యం దేహి మే రమే"
అని శ్రీరగ్రంధిపూజామంత్రమును చెప్పెదరు.

13. వివాహకాలమున వరుడు వధువునకు మంగళ సూత్రమును కంఠమున గట్టును. ఆ సూత్రమును వరుడు తన స్వహస్తములతో తయారు చేయవలసియున్నాడు. అట్టి సూత్రమును భార్య ధరించుటచే భర్తకు సంపూర్ణాయువును భార్యకు సుమంగలీత్వమును ప్రాప్తించును. సూత్రధారణమంత్రముయొక్క అర్థమును తెలిసికొనుడు.

"మాంగల్యతంతునాఽనేన మమ జీవనహేతునా
కంఠే బధ్నామి శుభగే, త్వం జీవ శరదశ్శతం."

ఇవి గాక, పురాణేతిహాసకాలమున పట్టుదుకూలములును, పలువిధములైన ఖద్దరు వస్త్రములును వాడుకలో నుండెను.

(a) వాల్మీకిరామాయణమున బాలకాండలో సీతకు ఊర్ణవస్త్రములును, విలువగల దుకూలములును యుండినట్లు చెప్పబడెను.

(b) మహాభారతమున సభాపర్వములో యుధిష్ఠిర చక్రవర్తికి, భరతఖండములోని వివిధభాగములనుండి వచ్చిన సామంతరాజులు బంగారపు సరిగంచులుగల ఉన్నివస్త్రము లు కానుకలిచ్చినట్లు వ్రాయబడియుండెను.

(c) కొన్ని బౌద్ధశాసనములను బట్టి రాజులు సహితము తమధనమును నేతగాండ్రసంఘములలో నిలువజేయు చుండినట్లు తెలియుచున్నది.

(d) నారదస్మృతి వ్రాసినకాలముననే కళాభిజ్ఞులకును వారియొద్ద పనినేర్చుకొను వారల (వాలంటీర్ల) కును నిబంధన లేర్పడియున్నవి.

(e) కౌటిల్యుని అర్థశాస్త్రమున రాజకుటుంబము లలో నూలు వడికించి నేయించుటకు సూత్రాధ్యక్షు డను ఉద్యోగిని నియమించి పని నిర్వహించవలెనని శాసింపబడెను.

(f) శుక్రనీతి వస్త్రపు డను ఉద్యోగి యొక్కయు, ఆతడు చేయవలసిన పనులయొక్కయు నిర్వచనము తెలుపుచున్నది.

ఈవిధముగ శృతి, స్మృతి, పురాణేతిహాసములలో నూలు వడుకుట, వస్త్రములు నేయుట స్వధర్మమనియు,

అవశ్యాచరణీయమనియు ఘంటాఘోషముగ విధింపబడి యుండ, చీటికిమాటికి, "శాస్త్రం, శాస్త్రం" అని గగ్గోలుపెట్టు పూర్వాచారపరాయణులు కొందరు కద్దరు వస్త్రధారణమునకు విముఖత్వము జూపుటయందుగల అర్థము బోధపడుటలేదు. ముక్కుపొడియందు పూర్వాచారపరాయణులకుగల అభిమానమును కద్దరునందు చూపగలిగినచో, ఈసరికి హిందూదేశఆర్థికసమస్య పరిష్కారమై యుండెడిది. నశ్యములేనిదే వారు నిమిషమైనను నిలువలేరు. అట్టి నశ్యమును పీల్చుటకు, శాస్త్రప్రమాణము కలదాయని, ఒక మనిషి ఒక శాస్త్రులవారిని ప్రశ్నించగా ఆయన ఈప్రమాణమును చెప్పెను.

"నశ్యదానం మహాదానం అత శ్శాంతిం ప్రయచ్ఛమే.
అన్యథా పతితం విద్యాత్ దాత యచ్ఛప్రతీగ్రహీ."

అనగా ముక్కుపొడిని దానముచేసినవాడు షోడశమహాదాతలకంటె గొప్పవాడు. కాన అట్టిదానమువలన నాకు శాంతిగలుగుగాక. ఇతరదానములను గావించినవాడును, ప్రతిగ్రహించినవాడును ఉభయులును నరకముజెందుదురు. అని అర్థమునిచ్చు నొకశ్లోకమును ఆశాస్త్రులవారు ప్రమాణముగనిచ్చిరి.

మరియొక్క ఘనాపాటీ పండితుడు వచ్చి నశ్యముయొక్కమహిమను వేదము వేనోళ్ళ వక్కాణించు చున్నదని వాదించుచు

"ఏతా వా నశ్యమహిమా।
అతో జ్యాయాగ్ శ్చ పురుషః॥"

అని తైత్తిరీయములోని వాక్యమునకు 'నశ్యమహిమా' అనగ ముక్కుపొడియొక్క మహిమ, ఏతావా=ఎంత కలదో వర్ణింప వీలులేదు. అని అర్థమును జెప్పి, ముక్కుపొడియొక్క ఆవశ్యకతను శాస్త్రాధారముచే పోషింప యత్నించినాడు. చిత్తగించితిరా! ఈపూర్వాచార పరాయణునకు ముక్కుపొడిమీద ఎంత అభిమానముకలదో! పూర్వకాలమున సహగమననిరోధచట్టమునకు అడ్డుపడినది ఇట్టిపూర్వాచారపరాయణులే. దేవాదాయధర్మాదాయ చట్టమును ప్రతిఘటించినదియు, ఈపూర్వాచారపరాయణులే. ఇటీవల రజస్వలానంతర వివాహశాసనమును నిరోధించినదియు ఈపూర్వాచారపరాయణులే! స్త్రీవిద్యాభివృద్ధికి ఆటంకమును కలుగజేసినదియు ఈపూర్వాచార పరాయణులే. యజ్ఞమునందు పశుహింస పనికిరాదని వక్కాణించువారి వాదమును ఖండించుచున్నవారును ఈపూర్వాచారపరాయణులే. ఇప్పుడు వేదశాస్త్రవిహితమైన కద్దరువ్యాప్తికి సహాయనిరాకరణ

మొనర్చు చున్నదియు ఈపూర్వాచారపరాయణులే. వేద శాస్త్రపురాణేతి హాసములలో ఇన్ని ప్రమాణములను కను పర్చిన పిమ్మటనైన, వర్ణాశ్రమధర్మపరాయణుల మని చెప్పు కొను ఈపూర్వాచారపరాయణులు, తమఘరంగీదుస్తులను నేటివరకు వదలకయుండుట కడుసాహసము. సీమగుడ్డను వదలక పోవుటయేగాక ఈపూర్వాచారపరాయణులు మరి యొక అపచారమునకు కూడ పూనుకొనుచున్నారు. 1 వ అక్టోబరు తేదిన శారదాబిల్లు ఆమోదింపబడి చట్టరూపము దాల్చినందున, టి. ఆర్. రామచంద్రియ్యర్, యం. కె. ఆచార్యా మున్నగు ప్రముఖులు, అస్పృశ్యులని తమచే నిది వరకు దూరముగ నుంచబడిన మహమ్మదీయులను నిప్పుడు భాయ్, భాయ్ అని చేతులు కలుపుకొని ఒకప్రత్యేక రాజకీయపక్షమును లేవనెత్తి, యావద్భారత మహాజ నులచే బహిష్కరింపబడిన సైమను సంఘ దొరలకు శారదాచట్ట విఘాతమహాజర్లు తయారుచేసి స్వయముగ సీమలో నివేదించుటకు గాను తా మిదివరలో దూషిం చిన సముద్రయానము నిప్పుడు ఆపద్ధర్మముగ నంగీ కరించుచు ఒక రాయబారమును సీమగుడ్డలలో సీమదొరల యొద్దకు పంపదలచుచున్నారు. మరియు శారదాచట్టనిర్మూ లనమునకై చండీయాగమును చేయ సమకట్టుచున్నారు. లక్షలకొలది ధనమును వెచ్చించి, ఆంధ్రఆంగ్లదైనిక పత్రిక

లను స్థాపించి చట్టనిరోధమును ప్రచారముచేయ బూను కొనుచున్నారు. ఇట్లు తాము పట్టినపట్టును నెగ్గించుకొను టకై భూమ్యాకాశములను తలక్రిందుజేయుచు కాలప్రవాహమున కెదురీదుచున్న కొందరు పూర్వాచారపరాయణులు ఇప్పుడు నేను విన్నవించిన వేదప్రమాణములను పాటించి మహాత్ముని కద్దరుద్యమమునకు సుముఖులగుచో, హిందూదేశముయొక్క ముక్తి కరతలామలకము గాక యుండునా!

నారీమణులారా! ప్రతిజీవియు తాను ధర్మముమీద నాధారపడి యున్నంతవరకే ఈలోకమునగాని, లోకాంతరమునగాని సద్గతులు పొందగలుగును. స్వధర్మానుష్ఠానమున ప్రతివారును జాగరూకులై యుండవలెను పరధర్మమెంత అందముగ కనుపించినను, అయ్యది హానికరమగును. ఈభావమును వ్యక్తపఱచు నుద్దేశ్యముతో శ్రీకృష్ణభగవానులు అర్జునునకు కర్మయోగమును బోధించుచు, నిట్లుపదేశించియుండెను.

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః॥"

అనగా స్వజాతిధర్మము గుణరహితమైనట్లు కనుపించినను, గుణమున్నట్లు తోచు పరధర్మముకంటె శ్రేష్ఠము.

కాబట్టి ప్రాణాపాయము తటస్థించినను స్వధర్మమునువీడి పర ధర్మము ననుష్ఠించరాదు. ఆంగ్లేయులకు ఆలోపతివైద్యము మే లొనర్చునట్లు హైందవులకు ఆయుర్వేదచికిత్స ఫలదా యక మగును. బ్రిటీషువారికి మ్యాన్ చెష్టరుమల్లు ధారణ యోగ్య మైన చందమున ఆర్యావర్త నివాసులకు కద్దరుధార ణము తరణోపాయ హేతువగును.

ఇట్టి స్థితిలో హైందవులలో పెక్కు లిప్పుడు పరదేశ వస్త్రములనే ధరించుట, వారికి ధర్మము తెలియకను గాదు. తత్వము బోధపడకను గాదు. యథార్థ మేమన? వీరు పాశ్చాత్యవ్యామోహమున జిక్కి భోగలాలసు లగు చున్నారు. కంటికింపును, నేత్రములకు రామణీయమును పెంపొందించు భోగపరాయణత్వమునకు దాసానుదాసులై స్వధర్మమును మరచి పాపకర్మను బలాత్కారముగ నాచ రించున్నారు.

"అథ కేన ప్రయుక్తోఽయం, పాపం చరతి పూరుషః,
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ, బల్వాదివ నియోజితః॥"

ఓస్వామీ, మనుష్యుడు దేనిచేత ప్రేరేపింపబడి తన కిష్టములేకున్నను బలాత్కారముగ దుష్కర్మ నాచరించుచు న్నాడు? అని అర్జునుడు భగవానుని ప్రశ్నింపగ వాసుదేవు డిట్లు ప్రత్యుత్తర మిచ్చుచున్నాడు.

"కామ ఏషః క్రోధఏష రజోగుణసముద్భవః
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణం॥"

అర్జునా! కోరికయనే చిత్తవృత్తి ఎన్నటికిని తనివితీరని ఆగి హోత్రమువలెపరిణమించి మహాపాపాచరణమునకు కారణభూతమై యున్నది. అయ్యది నీకు ప్రబలశత్రువుసుమా! అని చెప్పెను.

"నజాతుకామః కామానా ముపభోగేన శామ్యతి
హవిషా కృష్ణవర్త్మేవ, భూయఏవాభివర్ధతే॥"

అగ్నిలో నేయి పోసినకొలది, అయ్యది చల్లారుటకు బదులు ఎట్లు అభివృద్ధి జెందునో, అట్లే ఈకోరికలను తృప్తి పరచిన కొలదియు, ఆశ పెరుగుచుండునుగాని తరుగదు.

శబ్ద స్పర్శ రూప రస గంధములనెడు విషయాదులకు మనుజుని పంచేంద్రియములు వశములై యున్నవి. అందులో రూపము అను మోహపాశముచే నేత్రేంద్రియము బంధింపబడి, దేహి మిగుల బాధింపబడుచున్నాడు. ఈ హేతువుచేత స్త్రీపురుషు లిప్పుడు తనకు వన్నెవన్నె విలువగల అన్యదేశవస్త్రములు కావలె ననెడు ఆశలో పడిపోయినారు. ఈయాశాపిశాచమునుండి తప్పించుకొను టెట్లు?

"ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా।
జహిశత్రుం మహాబాహో కామరూపం దురాసదం॥

అనగా, బుద్ధికంటె నుత్కృష్టునిగా ఆత్మను తెలిసి కొని, బుద్ధిచేత మనస్సును వశపర్చుకొని జయింప దుస్సాధ్యుడైన ఈ యాశాశత్రువును నశింపజేయుము. అని గీతాచార్యుని యుపదేశమైయున్నది. ఈమంత్రోపదేశమును నిత్యము మననము చేయుచు, అన్యదేశవస్త్రసాంకర్యము నుండి తప్పించుకొని స్వధర్మానుష్ఠాతలమై కద్దరుధారణమును బూని మహాత్మాగాంధి తలపెట్టిన మహాకార్యమునకు చేయూత నిచ్చి ఆర్యావర్తపుణ్యభూమిని దాస్యశృంఖలమునుండి తప్పించి కృతకృత్యుల మయ్యెదము గాక యని ప్రార్థించుచు, మీయెదుటనున్న ఈకద్దరు తీర్మానమును నేను మీఅందరి తరఫున నామోదించుచున్నాను.

## తీర్మానము.

" భారత దేశముయొక్క ఆర్థికసమస్యాపరిష్కారమును, రాజకీయ విముక్తియును కద్దరుమీదనే ఆధారపడి యుండుటచే, అట్టి కద్దరువ్యాప్తికై భారతతంతుకారసంఘమువారు కావించుచున్న కృషికిని, దేశీయకాంగ్రెసుమహాసభవారు చేయుచున్న ప్రయత్నములకును పురుషులతోపాటు స్త్రీలును విధిగా తోడ్పడవలయునని కోరుచు, సత్వరస్వాతంత్ర్యము నపేక్షించు ప్రతిభారతరమణియు, ముఖ్యముగ ఆంధ్రనారీమణు లెల్లరును, నూలువడుకుట, స్వదేశవస్త్రములను

ధరించుట దీక్షగా నవలంబించవలెనని ఈ సభవారు సవిన యముగ ప్రార్థించుచున్నారు. ”

నారీమణులారా! భారత రాజకీయ విముక్తి కద్దరు మీద నాధారపడి యున్నట్లు, ఇప్పుడు మీయెదుట ప్రవేశ పెట్టబడిన ఈతీర్మానము హెచ్చరించుచున్నది. రాజకీయ విముక్తికై అన్యులమీద నాధారపడరాదనియు, దేశజనులు రాట్నపరిశ్రమము ద్వారా స్వశక్తిని సంపాదించుట వల ననే, దాస్య శృంఖలములు వీడుననియు, నాయుపన్యాసము నందు సోపపత్తికముగ చర్చించియున్న దానను. కాన తమ యేకగ్రీవసమ్మతిని బడయుటకై ఈ తీర్మానము నే నిప్పుడు బలపరచుచున్న దానను.

ఓమ్ తత్సత్.

## అ ను బ ం ధ ము .

ఆంధ్రపత్రికలో ప్రచురింపబడిన ఈ రెండుయుపన్యా సములనుగూర్చి యొకకద్దరుప్రియుడు కావించిన విమర్శనము.

“ఈయుపన్యాసములు కద్దరుయొక్క సర్వతోముఖ మైన తత్త్వమును వెలిబుచ్చుచున్నవి. అన్నికార్యములను ఒక్కసాధనముచేతనే సాధించవచ్చునని తెలిపిన యీసందే శమునందు విలువయెంతోగలదు. ఒకవేవస్తువు అన్నింటికిని

మూలకారణమని వినుటతోడనే ప్రతి హైందవునకును తన దృష్టి భగవానుని పైకి పోయి వ్రాలుచున్నది.

" ఏక మే వాద్వితీయం బ్రహ్మ "

ఆదియందును అంతమందును ఒకటే వస్తువు కలదు. అనేకమునకు ఏకమే కారణము. కారణమైన ఏకము కార్యమందు అనేకముగ వ్యక్తమగుచున్నది. అన్నిరోగములకును ఒక్కటియే ఔషధము. అన్ని సాధనలకును ఒక్కటియే గమ్యస్థానము. అన్ని పురుషార్థములకును ఒక్కటియే మార్గము. ఇహమునకును పరమునకును వినియోగము కల దేది ? భుక్తికిని, ముక్తికిని సాధనభూత మైన దేది ?

" నాన్యఃపంథా విద్యతేఽయనాయ "

అనగ మోక్షమున కింతకంటె వేరుమార్గము లేదు. అని వేదము బోధించునట్లును,

"అన్నగ్ంహి భూతానాంజ్యేష్ఠం, తస్మాత్సర్వౌషధ ముచ్యతే."

అనగ సర్వభూతములకంటె ముందుగ అన్నము పుట్టినది. కాన అయ్యది అన్నింటికి ఔషధ మగుచున్నది. అని వేదాంత ముపదేశించు చందమునను, భుక్తికిని, ముక్తికిని, స్వరాజ్యమునకును, స్వారాజ్యమునకును రాటమే శరణ్యా మని

ఈ యుపన్యాసకు రాండ్రు నిరూపించుటలో అతిశయోక్తి యేమియును లేదు.

కద్దరు పరిశ్రమ - భుక్తినిచ్చుట.

పూర్వకాలమున హిందూదేశములో నూలు వడుకుటయును వస్త్రములు నేయుటయును ప్రధానజీవనాధారములుగ నుండెను. నేతపరిశ్రమ హిందూస్థానములోని సగము మందికి జీవనోపాయముసకల్పించియుండెను. వడుకుటయును, నేయుటయును మిక్కిలి తేలికపనులు. ఇతరపని చేయలేని వారందరును దీనినే అవలంబించుచుండిరి. సాలీలు తమ పనినంతను ఇంటి ఆవరణములో ముగించుకొను చుండిరి. భార్యయును పిల్లలును బయటకు పోనక్కరలేకయే, నేత పనిలో భర్తకును, తండ్రికిని తోడ్పడుటకు అవకాశమున్నందున అన్నివృత్తులకంటె ఇదియెక్కువ వీలుగా నుండెను. నేత నేయువారు సంఘములో గౌరవముగ చూడబడుచుండిరి. నేతగాడు దినమంతయు పనిచేసినయెడల సంవత్సరమునకు రు 108-8-0 సంపాదించ గలుగుచుండెను. ఇప్పటి కరీదునుబట్టి వాని ఆదాయము సంవత్సరమునకు రు 550-0-0 లకు మించుచుండెను. సాలీలు కొందరు వ్యవసాయము సయితము చేసికొనుచుండిరి. కొందరు వ్యవసాయకులు పనిలేని కాలములో నేతసాగించి ఆదాయమునకు తోడు జేసికొను

చుండిరి. అప్పటిజనుల వస్త్రములకు ఆహారమున కయినదాని లో మూడవవంతు ఖర్చు అగుచుండెను. అన్నితరగతుల జను లును తీరినప్పుడు కాలము వ్యర్థపరచక నేతపరిశ్రమను సాగిం చుచుండి రని డాక్టరు బుకానను గారు సాక్ష్య మిచ్చియుండిరి. దేశమునకు కావలసిన వస్త్రములు ఇచ్చటనే నేయ బడి మిక్కిలి చౌకగా నుండుటచే విదేశవస్త్రములు వీనితో పోటీ చేయలేకపోయెనని 1813 సం॥ లో వారన్ హేస్టింగ్సు గారు పార్లమెంటు యెదుట సాక్ష్య మిచ్చియున్నారు.

కద్దరు నిర్మాణమున హిందూదేశమున కెట్లు ఆధి పత్యము రాగలిగెను ?

ఇచటనే ప్రత్తిపండుటయును, అదియు పుష్కలముగా దొరకుటయు ముఖ్యకారణము. ప్రత్తి యుత్పత్తితోపాటు జనులకు పారంపర్యముగా వచ్చి సహజమై, సంవర్ధమాన మైన నేర్పరితనము రెండవకారణము. దానికితోడు రంగులువేసి విచిత్రముగ నద్దకము చేయగల నిపుణత్వము వర్తకప్రపం చములో హైందవుల కగ్రస్థాన మిప్పించగలిగెను. మరియు హిందూదేశపు శీతోష్ణస్థితి రంగులకు చేవయు, ఇంపుగొలుపు నిగనిగలును సమకూర్చి ఎన్నటికిని వెలిసిపో గట్టితనమును గలిగించుటచే మనవస్త్రములు, ప్రపంచవర్తకరంగమున నిలిచినవి.

## మహమ్మదీయ చక్రవర్తుల తోడ్పాటు.

మహమ్మదీయ చక్రవర్తులు దేశీయవృత్తులను పెం పొందించిరి. వారు భోగపరాయణు లగుటచే బంగారు లతో పోటీపడి మజ్లినునేతను పెంపొందించిరి. "అక్బరు మరణకాలమున ఇండియాపరిస్థితులు" అను పేరుతో మోర్లెండు వ్రాసిన గ్రంథములో ఆకాలపువస్త్రముల ఉత్పత్తియొక్క అంచనావేసి జనాభా ననుసరించి తలకు 13 గజములవంతున ఉత్పత్తి యగు నని మదింపువేసిరి. బర్ని యరు, టావర్నియరు మున్నగు పాశ్చాత్యులు ఇండియాలోని కద్దరునిర్మాణమును అక్బరు తరువాతి చక్రవర్తులుకూడ పెంపొందించి యుండి రని తెలిపిరి. తక్కినవృత్తులలో వలెనే మహమ్మదీయులు హిందువులతోపాటు నేతనేయుటకు బూను కొనిరి. దక్షిణదేశములోని "తిరువళ్లువరు" వలెనే, మహమ్మ దీయభక్తాగ్రేసరుడైన "కబీరుదాసు"గారు కూడ నేతవృత్తి నవలంబించి సుఖజీవనముగావించి యుండెను. ఒక్కసంయుక్త రాష్ట్రములలో దప్ప ఇప్పటి పింజారీ లందరును అనగా దూదే కులవాండ్రు మహమ్మదీయులుగ నుండుటజూడ, మహమ్మ దీయపరిపాలనములో దూదేకుట యొక గౌరవవృత్తిగా ప్రత్యే కింపబడె ననుట నిశ్చయము. మొదట పింజారీలు దిండ్లు, పరు పులు మాత్రమే చేయుచుండినను పిమ్మట వారు యేకులు

చేసి నూలువడకుటకుగూడ తోడ్పడుచుండిరి. తదుపరి దళాళ్ వృత్తినిసహితము అవలంబించి యుండిరి.

హిందూదేశవస్త్రములు ఐరోపాదేశీయుల నాకర్షించుట.

ఇండియాలో విరివిగా నుత్పత్తియగుచున్న వస్త్రములను కొని విదేశములలో వ్యాపారము చేసికొనుటకై మొదట ఐరోపాజాతివారు మనదేశమునకు వచ్చియుండిరి. పోర్చుగీసులు, ఉలాందావారు (డచ్చి), పరాసులు (ఫ్రెంచి), తుదకు ఆంగ్లేయులును బొబ్బటిల్లుచున్న వర్తకప్రవాహము లో కొట్టుకొనివచ్చిరి. వర్తకపుపోటీ అధికమై ఒకరికి లేకుండచేయవలె నని మఱియొకరు ఘోరయుద్ధములు చేసిరి. వారిలో నింగ్లాండువారు విజయమును గాంచి తక్కిన ఐరోపియనులనెల్ల ఇండియానుండి వెడలగొట్టి, వర్తకమునకు దోడు దేశపరిపాలనమునుగూడ సంపాదించుకొనగలిగిరి. మనవస్త్రములు ఇంగ్లీషువారికి నచ్చినందున వారు ఈ వస్త్రవ్యాపారమును క్రమముగ వృద్ధిజేసిరి. ఇంగ్లాండులోని జనుల రుచులు మారిపోయి ఇండియాగుడ్డలపై వ్యామోహ మెక్కువయ్యెను. జను లెడతెగక ఈగుడ్డలనే కాంక్షించుచుండుటచే వస్త్రముల యెగుమతి అమితముగ పెరిగిపోయెను. విశేషముగ లాభము వచ్చుచుండుటచే 1677 సం॥ లో ఈస్టిండియాకంపెనీ షేర్ల మీద నూటికి 20 వంతున లాభము పంచిపెట్టబడెను. క్రొత్త

కంపెనీలు స్థాపింపబడెను. నూతనవర్తకదండయాత్రలు బయలుదేరెను. 1696 సం॥లో ఒకవిదేశీయు డిట్లొక గ్రంథమున వ్రాసెను. "ముప్పదిషిల్లింగులు బెట్టి ఒక గజము మజ్లిను కొంటే చేతులలో పట్టుకొన్నట్లేయుండదు." డిఫో అను గ్రంథకర్త ఆంగ్లేయులకు ఇండియావస్త్రము లెట్లు ఫ్యాషన్ అయినదో తెలుపుచున్నాడు. "ఆంగ్లేయులు ఇండియాదేశపుగుడ్డల షోకులో బడిపోయినారు. ఆగుడ్డలను మనలో గొప్పయింటి స్త్రీలు షోకు అనే భ్రమతో ధరించుకొనుచున్నారు. ఇండియాగుడ్డలు మన రహస్యపు గదులలోను పండకటిండ్లలోను బ్రవేశించినవి. దిండ్లకు, తెరలకు, కుర్చీలకు నవియే శరణ్యమైనవి. చివరకు మన పరుపులుకూడ వానితో కుట్టించుకొనుగతియే పట్టినది. భారతదేశపు గుడ్డల వెల మనదేశపుగుడ్డల ఖరీదులో ఆరింట నైదు పాళ్లుగా నుండుటచేత దూరమునుండి దిగుమతి చేయబడియు అన్ని లాభములుపోను మనవాటికంటె చవుకగా అమ్మబడుచున్నవి" అని ఆయన వ్రాసెను.

## హిందూదేశపునూలుపరిశ్రమను అణగద్రొక్కుటకై చేసిన ప్రయత్నములు.

1700 సం॥నను తరువాతను ఇంగ్లీషు పార్లమెంటువారు అనేకచట్టములనుజేసి ఇండియావస్త్రములను నిషేధించిరి.

ఆ సంవత్సరములో ఇండియానుంచి అద్దకపు కాలికోలు ఇంగ్లండుకు రాకూడ దని యొకచట్టము చేయబడెను. 1721 సం॥ లో తెల్లకాలికోలుకూడ దిగుమతి చేయకూడ దని నిషేధించి వాని నమ్మినవారికి 20 పౌనులు జరిమానాయు, కొన్న వారికి 5 పౌనులు జరిమానాయు విధించబడెను. 1737 సం॥లో ఇండియన్ నూలుతో చేయబడిన వస్త్రములుకూడ ధరించకూడ దని చట్టముచేసిరి. ఇండియాలో వృత్తులు నశింపజేసినగాని ఇంగ్లండులో పరిశ్రమలు అభివృద్ధికా వనే భావము ప్రబలెను.

హిందూదేశవస్త్రములపరిశ్రమ నశించుట.

ఇండియాలో పాలనాధికారము వహించిన కంపెనీ ఉద్యోగులు హిందువులను ఘోరదురంతములకు లోనుజేసిరి. కలకత్తాలో కంపెనీన్యాయాధికారి బోల్టుసుగారు కంపెనీ యుద్యోగులచర్యలను తీవ్రముగ ఖండించిరి. హిందూ నేతగాండ్రయొక్కయు, వర్తకులయొక్కయు బాధ లెక్కువయ్యెను. నిర్బంధములు, శిక్షలు దుస్సహములయ్యెను. అధర్మపు సుంకములు విధింపబడెను. ఇండియాలో కొన్ని భాగలములో సరుకులమీద 100 కి రు 17½ వంతున రహదారిపన్నులు విధింపబడెను. మఱికొన్ని రాష్ట్రములలో ప్రత్తిమీద 100 కి 5 వంతునను, నూలుమీద 7½ వంతు

నను, గుడ్డమీద $2\frac{1}{2}$ వంతునను, అద్దకముమీద $2\frac{1}{2}$ వంతునను సుంకములు వేయబడెను. ఈ చిక్కులుపడలేక జనులు తమ సరకులను రహస్యముగా పంపుచుండెడివారు. దీని నాపుటకు సోదాలను జేయుచుండిరి. అంగళ్ళలోగాని, రోడ్డుప్రక్కను గాని అమ్ముకొనే అందరి వర్తకులమీదను ముతార్ఫా పన్ను విధింపబడెను. ఈ కారణములవలన సాలీలు నేతవలన జీవనము సాగక ఇతరవృత్తుల నవలంబించి యల్లాడవలసివచ్చినది. దీనికి తార్కాణముగ బోల్టుగా రిట్లు సాక్ష్యము నిచ్చిరి. జంగులుకరీ ప్రాంతములనుండు జిల్లాల సాలీలందరును 700 కుటుంబములవారు ఈబాధలు పడజాలక వృత్తిని, దేశమును త్యజించి పారిపోయిరట. నాగోడు లను పట్టు సాలీలు కంపెనీవారు నేత నేయు మని తమ్మును నిర్బంధించ కుండుటకు గాను తమ బొటన వ్రేళ్లను తెగగొట్టుకొనిరి" అని వ్రాసిరి.

## ఇంగ్లీషువారి వస్త్రపరిశ్రమాభివృద్ధి.

1765 సం॥ లో యంత్రపు మగ్గమును 1768 సం॥ లో ఆవిరి యంత్రమును నిర్మింపబడుటచే, ఇంగ్లండులో నేతపరిశ్రమ సంపూర్ణదశకు వచ్చినది. ఇండియానుండి ఇంగ్లండు ప్రవాహముగట్టివచ్చిన ధనముతో ఈయంత్రములు అభివృద్ధి జెందెను. ఈ హిందూదేశపు ధనము, ఇంగ్లీషువర్తకులకు ప్రపంచములో పరపతి యెక్కువగుటకును, వారి పరి

శ్రిముల యభివృద్ధికిని తోడ్పడెను. ఇంగ్లీషు వస్త్రములను ఇండియాలో ఖర్చుపెట్టుటకు విశ్వప్రియత్నములు కావింప బడెను. 1813 సం॥ లో ఇంగ్లీషువారి పరిశ్రిమల వృద్ధిపరచు మార్గముల నరయుటకు పార్లమెంటువారు విచారణ గావించిరి. ఇండియా వస్త్రముల ఖరీదుమీాద 100 కి 80 వంతున నిషేధసుంకములు విధింపబడినవి. ఇంగ్లండున కెగుమతియగు దూదిమీాద ఏవిధమైన సుంకములను మోపలేదు. ఇండియా గుడ్డలు ఇండియాలోనే అమ్ముడుపోకుండ అనేకప్రితిబంధములు కల్పింప బడెను. ఇంగ్లీషు నూలు ఇండియాకు 1823 సం॥న దిగుమతి యైనవి. 1833 సం॥లో యంత్రిపుమగ్గములు 2 వేలనుండి 1 లక్షవరకు పెరిగెను. అచ్చట ఉత్పత్తి యెక్కువైన కొలదిని ఇండియాలోని అంగడు లన్నియు బాహాటముగ తెరువబడినవి. ఇండియాలో వస్త్రముల యుత్పత్తియు కళాకౌశలమును రూపుమాసినవి. కేవలము దూది నెగుమతిచేసి, వస్త్రముల దిగుమతిచేసికొనుగతి ఇండియాకు పట్టినది. సమర్థులైన నేతగాండ్రు గలిగి సుప్రిసిద్ధమైన ఢక్కా మజ్లినుల నెగుమతిచేయుటకు కీర్తిగాంచిన హిందూదేశము, ఇప్పుడు ఇంగ్లండువారికి ప్రత్తిచేనుగ మారిపోయినది. దిగుమతివస్త్రములమీాద సుంకములు వేసి స్వదేశపరిశ్రిమల రక్షించవలసిన దని 1857 సం॥ లో కానింగు ప్రిభువు సూచించిన

ప్పుడు, అది పనికిరా దని ఇంగ్లండులో పెద్ద గందరగోళము జరిగినది. పైగా హిందువుల రుచుల ననుసరించి, లాంకషైరు వస్త్రములు తయారుచేయుటకు బ్రయత్నములు గావింప బడెను. ఇండియాలోని ఉద్యోగు లెల్లరును వారికి ఏజంట్లుగా యీపనికి తోడ్పడిరి. ఇందుకు ఇండియాలో వేయబడిన రైల్లుకూడా తోడ్పడ గలిగెను. ఇండియాలో ఇంగ్లీషువారు రైళ్ళు వేసిన ముఖ్యోద్దేశ్యమును గూర్చి డల్‌హౌసీ ప్రభువు ఇట్లు చెప్పెను. "ఇండియాదేశపు దూదిని ఇంగ్లండున కెగుమతి చేసికొనుటకును, ఇంగ్లీషువారి గుడ్డలను ఇండియాలో విచ్చలవిడిగ దేశమంతట పంచిపెట్టుటకును యీ క్రొత్త ప్రయాణసాధనములు మిక్కిలి యుపయోగ పడ గలవు." దూదిధర పెరిగి కొంతయెక్కువ ఆదాయము రయితునకు వచ్చినను దానితోపాటు భోజనపదార్థముల ధరలు పెరుగుటకు రైళ్లే కారణమైనవి. దేశములోని మూరు మూల ప్రదేశములకుగూడ, ఈ రైళ్లమూలమున, ఎగుమతుల వెఱ్ఱి వ్యాపించి దూది మార్కెట్టుయొక్కయు, నూరకపు పద్ధతులయొక్కయు సెగ పల్లెటూళ్ళకుగూడ సోకినది.

## ఇండియాలోని పల్లెగ్రామముల దుర్గతి.

ఇండియాలో గృహజీవితముయొక్క పాదులు కదలిపోయినవి. వందలకొలది కుంటుంబములు పల్లెలను వదలి

పట్టణములకు చేరుచున్నను పడిపోవుచున్న గృహములు పల్లె టూళ్ళలో నెన్నియో కన్పట్టును. ఖద్దరుకళాకౌశల మంతయు విదేశపు తెక్కలికాండ్రయొక్క అక్రమచర్యలకును, ధన తృష్ణకును బలియైనది. రాటములు మూలబడుటయో వంట చెఱుకుగ నుపయోగపడుటయో సంభవించినది. విదేశీయుల దిగుమగుతులు నిరాఘాటముగ దేశమంతట బ్రవేశించి స్వదేశపరిశ్రమల నంత మొందించినవి. స్వదేశపరిశ్రమలకు ప్రతిబంధముల గల్పించి విదేశవర్తకులు చౌకగా దెచ్చి యమ్ముకొనుటకు ప్రయాణసౌకర్యములు కల్పింపబడినవి. హిందూదేశపరిశ్రమల భావిదుర్గతినిగూర్చి 1806 సం॥లో ఒక పార్లమెంటు సభ్యుడు చెప్పినదానిని విల్సన్ అను చరిత్ర కారుడు తన గ్రంథములో నిట్లు తెలిపియున్నాడు.

"ఇండియా మనకు కావలసిన ముతకపదార్థము లన్నిటిని ఎగుమతిచేయుట యనగా ఇండియాకు రానున్న దుర్గతిని వేగముగా రప్పించుట యని యర్థము. హిందువు లెగుమతి చేసిన దూదితోనే వారికి గుడ్డలు నేసి పంపి మనకు ఓడకూలి, ఏజెంటుజీతము, కమీషను, భీమాఖర్చు, వడుకు నేతలకగు వ్యయము మొదలైన వన్నియు మిగుల్చుకొందుము. అప్పుడు హిందూదేశప్రభుత్వము స్వదేశపరిశ్రమల రక్షించుట కేమాత్రమైనను ప్రయత్నమే చేసియున్న యెడల విదేశీయులయంత్ర

ములయొక్కయు కళాకౌశల్యముయొక్కయు పోటీని సులభముగా నెదుర్కొనియుండును. కాని విధినియామక మట్లు లేదు. కోట్లజనుల దురవస్థయను పునాదిమీద ఆంగ్లేయ వర్తకభవనము నిర్మింపబడవలసియుండెను. బర్కుమొదలగు ఆంగ్లప్రముఖులు, ఇండియాలో బ్రిటీషురాజ్యమును స్థాపించుటవలన బీదరయితులకు ప్రతిదినమును కూడేర్పడునని తలంచియుండిరి. కాని అతనికుండలో నిదివరకున్న కూడు సహితము ఎండమావులలోని నీరయ్యె నని మనకు రుజువైనది."

ఇట్టిస్థితిలో భారతీయుల కర్తవ్య మేమి ?

విదేశవస్త్రబహిష్కారమూలమున స్వదేశవస్త్రదీక్షను వ్యాపింపజేయుటకంటె గత్యంతర మేమియు లేదని పెద్దలు వక్కాణించిరి.

(1) విదేశవస్త్ర బహిష్కారము. ఒకవ్యక్తికిగాని సంఘమునకుగాని హానికరమైన దానిని నిరాకరించి త్రోసివేయుట, బహిష్కార మనబడును. ఇయ్యది ప్రతిజీవికిని స్వాభావిక ధర్మము. ఆత్మరక్షణమునకై ఉపయోగించు ప్రాచీనగౌరవమార్గ మిదియే. బహిష్కారము కేవలము నిషేధించుటయే గాక నిర్మాణముకూడ నగును. విజాతీయవస్తువులను నిరాక

రించి, స్వశక్తిపై నాధారపడునప్పుడు ఆనిరాకరణబలము చేతనే సజాతీయవస్తునిర్మాణమును చేయవలసియుందురు.

I ఇంగ్లండు తన ఆర్థికపరిస్థితుల కవసరమై నప్పుడు ఈబహిష్కారమార్గమునే అవలంబించినది. ఎట్లన:—

(1) విప్లవమునకు తరువాత స్వపరిశ్రమల బెంపొందించుటకుగాను అమెరికాతో పోటీపడి తుదకు అమెరికాను వదలికొనవలసివచ్చెను.

(2) ఇట్లనే ఐర్లాండుయొక్క పెంపొందుచున్న పరిశ్రమలను అణగద్రొక్కినది.

(3) ఇండియాయొక్క కాలికోపరిశ్రమలను ధ్వంస మొనర్చినది.

II అమెరికాయును స్వాతంత్ర్యమహాయుద్ధములో నీ పంథనే త్రొక్కియున్నది.

(a) ప్రధాన నగరములలోని వర్తకులు స్టాంపు ఆక్టు రద్దు అగువరకును ఇంగ్లండునుండి యేవస్తువుల దిగుమతియు చేయమనియు, అదివరకు చేసిన ఒడంబడికలు రద్దుచేసికొనెద మనియు, పూర్వపు బాకీలు తీరుమానించుటకు డబ్బుపంప మనియు ఒడంబడికలు వ్రాసియిచ్చిరి.

(b) ఇంగ్లండుయొక్క సహాయముతో పని లేకుండ జేసి కొనుటకుగాను తమ దేశీయపరిశ్రమల వృద్ధిబొందించుటకు ప్రయత్నములు చేసెను.

(c) ధనవంతులు ఖాదీవస్త్రములను పాతగుడ్డలను ధరించి తక్కిన వారికి మార్గదర్శులైరి.

(d) ఉన్నిని వృద్ధిచేయుటకుగాను, గొఱ్ఱెపిల్లలను భక్షించుట మానుకొనిరి.

(e) తమ దేశము స్వతంత్రరాజ్యమగుటచే, బహిష్కారోద్యమమునకు అవసరమైన చర్యలను అమెరికా తీసికొని యుండెను.

ఆత్మసంరక్షణకై (1) ఇంగ్లండు (2) అమెరికాలు ఎట్లు బహిష్కరణమార్గములను దొక్కియుండెనో అట్లే ఇప్పుడు

III ఇండియాకూడ బహిష్కరణకై పూనుకొనవలసి యున్నది. కాని ఇండియా విదేశ పరిపాలనమున నుండుటచే ప్రభుత్వమువారు దేశీయపరిశ్రమల నభివృద్ధిచేయరు. పైగా బహిష్కరణోద్యమమును ప్రతిఘటించెదరు. అయినను దేశీయులు ఆత్మశక్తిని నుజ్జీవింపజేసి, సంఘీభావమును పురికొల్పి, త్యాగశీలురై పట్టుదలతో బహిష్కారమును సాగించవచ్చును. ఇందుకుగాను,

( ) నాటుపనివాండ్రను, వారి భావనాశక్తిని, ఆదర్శములను బీరుపోనీయక వారి నాదరించి, వారికి వృత్తులను కల్పించి పోషించుటకుగాను విదేశవస్త్రముల నన్నింటిని మనము బహిష్కరించవలెను.

(b) దైనికజీవనమునకు ముఖ్యాధారవస్తువులకై మనము ఇతరులమీద ఆధారపడకూడదు.

(c) విదేశమునుండి వచ్చు దిగుమతులకు సమానమొత్తపు సరుకులను ఉత్పత్తిచేయుటకును, చేసిన వానిని దేశములో ఖర్చుపెట్టుటకును మార్గముల నరయవలెను.

(d) విదేశవస్త్రములపై ఇండియా నిషేధపుసుంకములను విధించవలసియున్నది. 44 వ కాంగ్రెసు మహాసభానుబంధముగా లాహోరులో జరిగిన అఖిలభారతఖద్దరుప్రదర్శనమును ఆచార్య ప్రఫుల్లచంద్రరాయిగారు 22-12-29 తేదిన ప్రారంభించుచు ఈ సుంకములను గూర్చి యిట్లు పలికిరి.

"భారతదేశము స్వాతంత్ర్యము కలిగియుండినచో ఇంమెలకు ప్రతిక్రియగా భారతదేశమునకు బ్రిటనునుండి పంపబడెడు సరుకులపై హెచ్చుపన్నును వేసి ఆ రీతిగా తన ప్రజలకు ముఖ్యాధార మగు వస్త్రములపరిశ్రమను కాపాడుకొనగలిగియే యుండును. కాని భారతదేశము పరాధీనతకు పాల్పడియుండుటచే ఈరీతిగా ఆత్మరక్షణ మొనరించుకొన

జాలకపోయెను. నేడు మనకు స్వరాజ్యము లభించినచో రేపే నేను తగిన శాసనములను గావించి మనకు నష్టమును గలిగించుచున్నట్టియు, మనకు భోగపరత్వమును వృద్ధినొం దించుచున్నట్టియు దిగుమతుల నన్నిటినిగూడ నిరోధించెను. స్విడ్జర్లెండులో నే నగరమునందునుగూడ విదేశవస్తు వొక్కటి యైనను మచ్చునకుగూడ దొరకదు. వారు దేశీయపరిశ్రమ లను కాపాడుట కట్టి హెచ్చుసుంకములను విధించియున్నారు.

(e) గవర్నమెంటుసంస్థలలోను, కచ్చేరీలలోను ఉ ద్యోగులు, నవ్రకర్లు ఖాదీవస్త్రములనే విధిగా ధరించునట్లు శాసనసభలో తీర్మానములు గావించవలసియుండును. ఇయ్యది దుస్సాధ్యమైన విషయ మని కొందరు తలంచవచ్చును. కాని యిట్టిశంకలకు తావులే దని సంయుక్తరాష్ట్రశాసనసభవారు ఈనెలలో కావించిన తీర్మానము ఋజువుచేయుచున్నది. ప్రభు త్వపరిష్ఠాపనలయందును పరిభుత్వసహాయము బొందెడి ప్రతి ష్ఠాపనలయందును కద్దరునే వాడవలయు నని ఆశాసనసభవారు తీర్మానము చేసియుండిరి. ఈపద్ధతినే ఇటీవల కొచ్చిన్ పరిభు త్వమువారును అవలంబించుట కంగీకరించిరి. ఇండియాగవర్న మెంటువారు ఏటేట తమకు కావలసిన సామగ్రిని, బ్రిటీషు స్టోర్సుకు సంబంధించిన ఇండియాస్టోర్సునుండియే గ్రహించు చుండిరి. కాని నేటికి ఆస్టోర్సుకు సంబంధించిన రూల్సును

సెక్రిటరీ ఆఫ్ స్టేట్సుగారు మార్చినట్లు గెజెట్టులో ప్రకటింప బడినవి. ఆ రూల్సులో ముఖ్యమైనది "ఇండియాలో తయారగు వస్తువులకే ముందు ప్రాధాన్య మియ్యవలెను" అని నియమ మేర్పడినందున దేశీయపరిశ్రమలకు జాలప్రయోజన కరమనుటకు సందియము లేదు.

## (b) స్వదేశవస్త్రదీక్ష.

స్వదేశోద్యమము 1906 సం॥లో ప్రారంభమాయెను. స్వదేశోద్యమము వచ్చినతరువాత దేశీయుల అభివృద్ధి తమ స్వశక్తిమీద నాధారపడియుండు నని తెలిసికొనిరి. హావేలు, ఆనందకుమారస్వామి మున్నగు కళాప్రవీణులు మగ్గపు నేతను పునరుద్ధరించు మార్గముల నరయుచుండిరి. హైందవదైనిక జీవితములో చర్ఖాను ప్రవేశపెట్టవలె నను అద్భుతపుటూహాలు మహాత్మా గాంధిగారికి తోచినవి. పూర్వము వారు రస్కిన్, టాల్‌స్టాయిల గ్రంథములను పఠించినప్పుడే బీదజనుల వృత్తులనుగూర్చి యోచించియుందురు. దారిద్ర్యపీడితులకు చర్ఖాయే కల్పతరువు. దానిని సర్వత్ర వ్యాపింపజేసినచో దేశదారిద్ర్యమంతరించును. వారు 1908 సం॥ లో ప్రకటించిన హైందవరాజ్య మను గ్రంథములో లాయర్లను, వర్తకులను, యంత్రాలయాధికారులను రాటముపై నూలు వడకవలసిన దని కోరియున్నారు. గాంధిమహాత్ముడు పుట్టు

టకు 75 యేండ్ల క్రితమే ఒక ఆంగ్లేయ ప్రభుత్వోద్యోగి రాటము చాల యుపయోగకర మని వెల్లడించెను. ఇతడు జాతివలన ఆంగ్లేయుడైనను ప్రాచ్యులపట్ల అత్యధిక మగు అభిమానము గలవాడు. ఇతనిపేరు హెన్రీథామస్‌కోల్ బ్రూక్. "వంగరాష్ట్ర వ్యవసాయము" అను గ్రంథమును 1800 సంవత్సరమునం దితడు ప్రకటించెననియు అందు నీక్రింది యమూల్యమైన విషయములు గలవనియు ప్రఫుల్లచంద్ర రాయ్‌గారు నుడివిరి.

"వితంతువ్రలను, తలిదండ్రులు లేని అనాధలగు బిడ్డలను, పొలముపనులు చేయుటకు వ్యాధి మున్నగు కారణములవలన నశక్తులగువారును, వంశాభిమానముచే అట్టి పనులను చేయుట నీచ మని భావించి యింటిపట్టుననే యుండి జీవించుటకును, వికలాంగులైన పురుషులను పోషించుటకును కల యాధారము రాటమొక్కటియేగాని మఱేదియును గాదు. నిరుపేదలు భారతదేశమున కోట్లకొలదిగా నున్నారు. వీరందరికిని జీవనాధారమును గల్పింపవలసిన బాధ్యత దొరతనము వారి కుండినను జనసామాన్యమునకు ముఖ్యముగా గలదు."

స్వదేశోద్యమము 1906 సంవత్సరమున యేర్పడినను ఆయుద్యమమునకును, 1920 సం॥న మహాత్ముడు తల పెట్టిన ఖద్దరుద్యమమునకును యెట్టి సంబంధమును లేదు.

స్వదేశోద్యమము కేవలరాజకీయహక్కులకొరకే యేర్పడెను. ఇప్పటి ఖద్దరుద్యమము ప్రేమపై నాధారపడియున్నది. ఆప్రేమకు వేరటువారియువారును, పోటుతినువారును గూడ లక్ష్యభూతు లగుచున్నారు. (అనగ, It blesseth him that gives and him that takes) జనసామాన్యమునకు అన్న వస్త్రములను లభింపజేయుటకే మహాత్ముడు ఖద్దరుద్యమము ప్రేమభావముతో తలపెట్టెను. ఆంగ్లేయులకుగాని, ఏమానవ జాతికిగాని, చివరకు అల్పక్రిమికిగాని బాధ కలిగించుటకు మహాత్ము డెంతమాత్రము నంగీకరింపజాలడు. మహాత్ముని సిద్ధాంతమును దెలుపుచు ప్రఫుల్లచంద్రు డిట్లు నుడువు చున్నాడు. "ప్రభుత్వాధికార బలమున బ్రిటన్ దేశపు బట్ట లను భారతీయులకు, మీ రంటగట్టకూడదు. ఇట్లు మీరు భారతీయులను ప్రాచ్యదేశీయులను బాధింప నక్కరలేకుం డనే సుఖజీవనము చేయుటకు మీ దేశమునందు మీ కవ కాశములు గలవు వానిని మీరు చక్కజేసికొనవల యును. మీరు జీవింపుడు. ఇతరులను జీవింపనిండు." అని మహాత్ముని సిద్ధాంతము. ఈ కద్దరుద్యమము కేవలము ఆర్థికమే యని కొందరు భావించెదరుగాని, దీనియందు రాజ కీయము, పరోపకారము, మతము, ప్రేమ మున్నగున వన్ని యుగూడ మిళితమై యున్నవి.

ఈ కారణములచే నిప్పటి జాతీయనిర్మాణకార్యక్రమ ములో చర్ఖా క్రమశః అగ్రస్థానము వహించినది. ఎట్లన:—

1920 సం॥న జరిగిన ప్రత్యేక కాంగ్రెసులో స్త్రీ పురుషులును, బాలబాలికలును ఆత్మశిక్షణమునకై కద్దరు తయారుచేసి ధరింపవలయు నని తీర్మానింపబడినది. ఆసంవత్స రముననే జరిగిన నాగపురం కాంగ్రెసులో ఆతీర్మానము బల పర్చబడెను. 1921 సం॥న జరిగిన బెజవాడసభలో 20 లక్షల రాటములచే పనిచేయించవలెనని నిశ్చయింపబడెను. ఢిల్లీలో జరిగిన భారతస్థాయిసంఘములో బాలభటులందరును నూలు వడుకుట నేర్చుకొనవలసిన దనియు, శాసనోల్లంఘన మవలం బింపగోరు ప్రదేశములలో 100 కి 60 మందివాతున అక్కడ తయారైన ఖద్దరునే ధరించవలెననియు తీర్మానించబడెను. 1924 సం॥ లో మహాత్మాగాంధిని చెరసాలనుండి విడిచిపెట్టిన తరువాత కాంగ్రెసుశాఖలసభ్యులందరును రోజునకు అరగంటవంతున వడుకవలసినదనియు, 2000 గజముల సాపైన నూలును వడికి చందాగా పంపవలసినదనియు అహమ్మదాబాదులో తీర్మానించబడెను. ఆ సంవత్సరాంతమున సభ్యు లందరు నూలునే చందాగా యియ్యవలసిన దని తీర్మానించిరి. ఈ తీర్మాన మిప్పుడు భారత చర్ఖాసంఘమున వర్తించుచున్నది. కాని కాంగ్రెసు సభ్యత్వమునకు మాత్రము, డబ్బైనను,

(11) అస్సాం రాష్ట్రములోని నవవంగప్రాంతములో దూదినిచ్చి గుడ్డనుగొను ఆచారము వ్యాపించియున్నది. దీనిని ఆధి లేక సంగోరు పద్ధతి యని పిలుచుచున్నారు. ప్రతి యిల్లును నేతయంత్రశాలగ మార్చిన అస్సాముయొక్క ప్రత్యేక పరిస్థితులు ఇండియాదేశము నంతను సర్వసామాన్యము కావలెను.

(12) నడిమివర్తకులతో అవసరములేకయే సాలీలే నూలుకొని గుడ్డ లమ్ముటయు గలదు. వడుకువారే ఏకులు చేసికొను ఆచారము కొన్నిచోట్ల గలదు.

(13) వడుకువారే దూదిని నిలువ చేసికొనుటవలన కలుగు లాభములు (a) పెద్దమొత్తములు ఖర్చుపెట్టి ప్రత్తి నిలువజేయవలసిన యావశ్యకత లేకుండును. (b) గుమాస్తాలు, భీమాలు మొదలైనవానికి కావలసిన ఖర్చు లన్నియు తగ్గిపోవును.

(14) భోజనపదార్థములకై కొన్ని ఎకరములు ప్రత్యేకించువిధముననే ప్రత్తికిగూడ యేర్పాటుచేసినయెడల పూర్వకాలపు నూలుసంతలును, స్వేచ్ఛావర్తకమును ప్రబలగలవు.

చర్ఖా మిల్లుయంత్రముతో పోటీచేయగలదా ?

యనెడి యాక్షేపణకు సమాధానము చెప్పవలసియున్నది.

చర్ఖావలన కలిగెడు లాభమునకును, మిల్లుయంత్రముల వలన కలిగెడు లాభమునకును హస్తిమశకతారతమ్యము గలదు. చర్ఖావలని లాభము భగవంతుడు దేశమంతటను కురిపించు వర్షమువంటిది. మిల్లులవలనిలాభము డి. పి. డబ్ల్యు. వారు నదికి ఆనకట్ట కట్టి, కాలువలద్వారా పొలములకు సప్లయిచేయు జలమువంటిది. జల్లువానవలన దేశమంతయు చల్లబడి నేల పదునెక్కి- అన్ని పొలములకు పంట లభివృద్ధి కలుగజేయును. కాలవనీటివలన కొన్ని పొలములు మాత్రమే తడిసి కొందరికే లాభించగలదు. వర్షపునీటికి ఖర్చు లేదు. కష్టమును లేదు. కాలవనీటికి; వ్యయము అధికము. ప్రయాస బహుళము. ఈ విధముగనే రాటపుపరిశ్రమకు ఖర్చు స్వల్పము. దేశజను లందరకును లాభించును. మిల్లు పరిశ్రమకు వ్యయము అధికము. పైగా కొందరికే ఉపకరించును. ఈ విషయమును రుజువుచేయుటకు మనము ఈక్రింది 5 హాంశములనుగూర్చి విచారించవలసియున్నది. చర్ఖాకు మిల్లునకు.

(1) కావలసిన మూలధనము ఎంత ?

(2) పట్టునట్టి కాలము ఎంత ?

(3) ఉత్పత్తికి అగు ఖర్చు ఎంత ?

(4) జాతికి రాగల లాభ మేమి ?

(5) సంఘముపై రానున్న మార్పు లేవి ?

(1) మూలధనము (2) పట్టునట్టికాలము.

యంత్రములయొక్క ప్రస్తుతమూలధనము 40 కోట్ల రూపాయలు. దీనితో 70 కోట్ల పౌనుల నూలు వడుకు చున్నారు. 15 మొదలు 18 నెంబర్లు నూలు ఉత్పత్తి యగు చున్నది.

చర్ఖామీద సం 1 కి 80 పౌనులు తీయవచ్చును. నె 10 రు నూలు ఒక్కరాటమునకు సం॥కు 120 మొదలు 130 పౌనులు తీయవచ్చును. 70 కోట్ల పౌనుల నూలు సులభముగా 90 లక్షల రాటములు పూర్తిగా పనిచేసినచో తీయవచ్చును. రాటములు చేయుటకు అవసరమైన ధనము యంత్రములకై ఖర్చుపెట్టిన దానిలో పదియవవంతుకూడ నుండదు. అదిగాక దేశములో లక్షలకొలది పాతరాటములు నిలువయుండియే యున్నవి. యంత్రములోని ఒక్కొక్క కదురు ఖరీదుతో 20 మొదలు 25 రాటములు వృద్ధిచేయ వచ్చును. ఇండియాలో మరకమగ్గులు చేయుపని 120 మొదలు 150 పౌనులవరకు వృద్ధియైనను 30 లక్షలు మొదలు 40 లక్షలకమ్ము క్రొత్తవి స్థాపించవలసియుండును. అదే విధముగ యంత్రములయొక్కయు మగ్గములయొక్కయు, సంఖ్యకూడ రెట్టింపు చేయవలసియుండును. కడచిన 10 సంవత్సరముల అనుభవమును బట్టిచూడ యియ్యది త్వరలో సాధ్యమగునని

తోచదు. ఇప్పటి మరలు చేయుచున్న ఉత్పత్తిని బట్టిచూడ సం॥కు 5 కోట్ల గజముల గుడ్డకంటె ఎక్కువ అభివృద్ధియగుట లేదు. ప్రస్తుతము ఇండియాకు దిగుమతియగుచున్న 150 కోట్ల గజములగుడ్డ దేశములో మరయంత్రములమీద తయారగుటకు 30 లేక 40 సంవత్సరములు పట్టవచ్చును.

(3) ఉత్పత్తిఖర్చు (4) జాతికి రాగల లాభము.

స్వోపయోగమునకై నూలును వడుకునప్పుడు అనగా ఉత్పత్తికారుడే వ్యయకారుడైనప్పుడు ఉత్పత్తిఖర్చు కొంత తగ్గిపోవును. వానికి వడుకుఖర్చు లేదు. దూదిఖరీదు నేతకూలి మాత్రమే గుడ్డఖరీదుగ భావింపబడును. వడుకునూలువస్త్రము చాలకాలము మనును. మరయంత్రములు విదేశపుసామాను మీదను, విదేశపు శిల్పజ్ఞానముమీదను ఆధారపడియుండుటచే విశేషధనవ్యయము చేసి సామానులు తెప్పించవలసియుండును. తెచ్చిన యంత్రములు కుదుర్చుటకుగాను ఇంగ్లండులో కంటె ఇండియాలో రెట్టింపుఖర్చు లగును. ఇకముందు యంత్రములను వృద్ధిచేసికొనవలెనంటే విదేశసహాయ మెల్లప్పుడు కోరవలసివచ్చును. వీటిమీద పన్నులు 3 కోట్లకు మిగులుచున్నది. ఒకవేళ సుంకములన్నియు తీసివేయబడినను, ఇంకను ఒకకోటి రూపాయిలు మిగులును. రాట్నపుపరిశ్రమకు దారిఖర్చులు, మోతఖర్చులు అవసరమే లేదు. యంత్రములకు

దారిమోత ఖర్చులు 7 లేక 8 కో ట్లగుచున్నది. ప్రకటనల ఖర్చుకూడా కలదు. వంటచెరుకు, భీమా, కమిషను, పన్నులు, అరుగుడు, రిపేర్లు మొదలగువానిక్రింద 100 కి 15 వంతున ఖర్చు అగుచున్నది. పనిచేయువారి సంఖ్య చాల యెక్కువగుటచే కూలి అధికమగుచున్నది. రాట్నపుపరిశ్రమకు ఇట్టి వృథా ఖర్చులు లేవు.

## 5. సంఘముపై రానున్న మార్పులు.

యంత్రములలో ప్రస్తుతము పనిచేయు కూలీలసంఖ్య 4 లక్షలు. ఈ పరిశ్రమపై ఆధారపడు దళారులు, చిల్లరవర్తకులు, పెద్దవర్తకులు మొదలగువారి నందరిని జేర్చినను మొత్తము 10 లక్షలకు మించదు. రాట్నపుపరిశ్రమ యన్ననో నూలు వడుకువారిసంఖ్యను తీసివేసినను కూడ ఒక్కచేమగ్గములమీద పనిచేయువారి సంఖ్య దీని కెన్నియో రెట్లుగలదు.

దేశములోని నిరుద్యోగసమస్య త్వరలో నెదుర్కొన వలసియున్నది. బీదలందరికిని పనిజూపి జీవనాధార మేర్పచుటకుబదులు యంత్రములు సంకుచితము చేయును. దేశములో జనులు పనిలేక సోమరులై దరిద్రములో మునిగి బాధపడుచున్న సమయములో కోట్లకొలది జనులకు వృత్తి గల్పించి, పూర్వార్జితమైన పనితనమునకు తిరిగి తా వొసగ

గలిగినది రాట్నపుపరిశ్రమయే. యంత్రశాలలోని శ్రమ, దాస్యము, అనారోగ్యములవల్లకూలీలు త్వరలో క్షీణించిపోవు దురు. యంత్రములయొక్క దార్ఢ్యము, గోల, సమ్మెలు, అల్లరులు అనుభవింపక తీరవు. పల్లెటూరిపనివాడు యంత్రశాలపనివానికంటె ఎన్నియోరెట్లు ఆరోగ్యముగను, సుఖముగను జీవించగలడు. పల్లెటూరివానికి కూలి తక్కువవచ్చినను తన కుటీరపరిసరములలో నెక్కువ సంతృప్తియు,ఆనందమును గలిగియుండును. పల్లెటూరిపనివాడు పదార్థసృష్టిని చేయవలసియున్నాడు. ఉత్పత్తియందు స్వాతంత్ర్యము గలిగియుండుటచే జాతియొక్కరుచిని నశింపనీయక పెంపొందింపవలసియున్నాడు. తనదేహమును, మానసమును వికాసము నొందింపవలసియుండుటచే అతడు జాతియొక్క పౌరుషమును, నిర్మాణశక్తిని పెంపొందింప గలడు. అర్థవంతమును, విజ్ఞానవంతమును నగు క్రొత్తపరిశ్రమలను సృష్టిచేయగలడు. కాన దేశకళలు వికాసమునొంది సౌభాగ్య మభివృద్ధి కాగలదు. యంత్రశాల పనివానికి అచ్చుపోడిచిన మనస్సు, అచ్చుపోడిచిన పదార్థము మాత్రమే యుండగలదు. అందువలన దేశస్థితి బాగుపడనేరదు.

ఖద్దరు దీక్షావ్యాపనము బహిష్కారోద్యమమువలన కొనసాగించవలసియుండు నని తెలుపబడెను. కాని బహి

ష్కారోద్యమముపై కొన్ని ఆక్షేపణలు ప్రయోగింపబడినవి. వానికి సమాధాన మవసరము. ఆక్షేపణలన్నియు మూడు తరగతులక్రింద విభజింపవచ్చును.

(1) కేట్‌గారి ఆక్షేపణ.

(a) బహిష్కారమునకు ఇంగ్లాండు జంకదు. 800కోట్ల పౌనులు అప్పుచేసి యుద్ధమొనర్చిన బ్రిటీషుదేశము సంవత్సరమునకు 4 కోట్ల పౌనుల వస్త్రవ్యాపారనష్టమును సులభముగ భరించగలదు. (b) స్వదేశవస్తువులయుత్పత్తి పెంపొందజాలదు. స్వదేశోద్యమమువలన భారతీయులకే నష్టజాతక మగును.

ఇందుకు సమాధానము:— బహిష్కారోద్యమము సాగి, విదేశవస్త్రములను సంపూర్ణముగా రాకుండ జేయగలిగినచో ఆర్థికనష్టముయొక్క దెబ్బను ఇంగ్లాండు త్రిప్పుకొనలేదు. ఇంగ్లాండుయొక్క ప్రధానపరిశ్రమమైన ఒక్కమిల్లు నూలుపని వెనుకడుగువేయ మొదలిడినచో ఆంగ్లేయుల యొక్క పారిశ్రామికప్రతిష్ఠాపనకంతకును, పరపతిసౌకర్యములకును, ఓడలప్రయాణములకును, రేవుస్థలములకును నష్టము రాక తప్పదు.

### (2) పెంట్లండు ప్రభువుగారి ఆక్షేపణ.

ఇండియాలోని బహిష్కారోద్యమమువలన ఇంగ్లండు నకు సం 1కి 8 కోట్ల పౌనులు నష్టమువచ్చును. ఈ నష్ట మొక గొప్పది కాదు.

ఇందుకు **సమాధానము.** బహిష్కారోద్యమమువలన సాలియానా నష్ట మెట్లున్నను, ఇంగ్లాండుయొక్క పెద్ద వస్త్రముల మార్కెట్టు పడిపోవును. డబ్బు నష్టమును మరి యొకవిధముగ ఇంగ్లండు భర్తీ చేసికొనగల దని యొప్పు కొన్నను, తన గుడ్డల అంగడిని తుడిచివైచి చేతులు కడుగు కొనుటకు ఇంగ్లండు సమ్మతించునా ? బ్రిటీషు వస్త్రములు ఇండియాలోనే అమ్ముడుబోవునుగాని, ఇతరదేశములవారు వానిని తమ దేశములోనికి చొరనీయరు. బ్రిటీషుసామ్రా జ్యములో చేరిన కెనడా, ఆఫ్రికా, ఆస్ట్రేలియా మున్నగు స్వతంత్రరాజ్యాంగనిర్మాణము గలవారు, తమ వస్త్రములపై రానున్న యీ పోటీకి సమ్మతించెద రనుట కల్ల. ఈ విధముగ బ్రిటీషువారియొక్క మిల్లునూలుపరిశ్రమకు స్వస్తి చెప్పవలసి యుండును.

### (3) కూబ్రోగారి ఆక్షేపణ.

దిగుమతి గుడ్డలలో నూటికి 75 వంతున పోటీవస్తువులు కావు. కనుక బహిష్కారము ప్రయోజనకారి కాదు.

ఇందుకు సమాధానము:— బహిష్కారోద్యమము వ్యాపించిన కొలదిని సన్నగుడ్డలపై రుచి, వ్యామోహము తగ్గిపోవును. దేశీయ లోకమారు మనోనిశ్చయము జేసికొనిన యెడల పోటీలోలేని సన్నగుడ్డలుకూడ బహిష్కరింపబడి, కొంతకాలము ముతుకవస్త్రములతోనే కాలక్షేపముచేయు టకు భారతీయులు వెనుకాడరు. ఉద్యమము సాగువరకు కొంచెము యోపికపట్టినచో పూర్వకాలపురోమక చక్రవర్తుల ఆస్థానములను అలంకరించిన డక్కామజ్లినులవంటి సన్నరకము గుడ్డలు విరివిగా తయారగుటయేగాక, ఇతరదేశములకు కూడ రవాణా కాగలవు. ఇందుకు పొందూరు సన్నకద్దరే మనకు తార్కాణము. సన్ననూలుపనితన మింకను కొన్నితావు లలో చపిపోలేదు. దానిని పునరుద్ధరించవలసిన బాధ్యత దేశీయులపై గలదు. ఈవిషయమై ప్రత్యేకముగ శ్రద్ధవహించి నచో పూర్వపు డక్కామజ్లినులను మించి యిప్పుడును తయా రుచేయవచ్చును. ఇట్టి సన్నని వస్త్రములు నేయుటలో మిల్లులు పోటీకి నిలువజాలవు. అయ్యవి రాటనుమీదనే తయారు కావలసియున్నవి. బంగాళానుండి పూర్వము రవాణా అయిన మజ్లినులకు 'గాంగేటికము' లని గ్రీకులు పేరిడిరి. వాటికే, "డయకోప్రిషియా" అని పేరున్నట్లు పెరిప్లను అను నాతడు తెలిపియున్నాడు. ఇట్టి మజ్లినులను ప్రశంసించుచు ప్లినీ,

పైరాడ్డు, పీచ్ఛీ, డాక్టరు యూరి, డాక్టరు టెయిలర్, ఫోర్బ్సువాట్సు మొదలగు పాశ్చాత్యగ్రంథకర్తలు వ్రాసియున్నారు. ఈ మజ్లినులు, సన్నముగను, మృదువుగను, లలితముగను నుండుటచే వానికి (1) సాయంప్రాలేయము (2) వాయువస్త్రము (3) అప్రవాణము అని రసికనామములను పెట్టిరి. ఇట్టి శృంగారవస్త్రములు తిరిగి ఇప్పుడును ఇండియాలో తయారు చేయుటకు వీలుగల వని కూబ్రోగారు తెలిసికొనవలసియున్నారు.

## మన కర్తవ్యము.

ప్రస్తుతము మనము 150 కోట్ల గజములగుడ్డయును, 6 కోట్ల పౌనుల నూలును యితరదేశములనుండి దిగుమతిచేసికొనుచున్నాము. 1 పౌను నూలుతో 5 గజములగుడ్డ తయారగును. కాన దిగుమతియగుచున్న 6 కోట్ల పౌనుల నూలుతో 30 కోట్ల గజములగుడ్డ తయారగును. మొత్తం (150+30) 180 కోట్ల గజముల గుడ్డను అధికముగ ఇచ్చుటనే తయారు చేయుటకు సం 1 కి 1 మగ్గమునకు 1200 గజముల చొప్పున 15 లక్షల మగ్గములు కావలసి వచ్చును. మనకు కావలసిన నూలును 1 కోటి రాటములు వడికి యియ్యగలవు. ప్రస్తుతము మన దేశములోనున్న మగ్గములును, రాటములును చాలవరకు పని పూర్తిచేయగలవు. కాన,

(1) ప్రతివారును కొంతకాలము ఖద్దరు అవసరమైన మట్టుకే ధరింపవలె నను నిర్బంధ మేర్పరచుకొనుట మిక్కిలిసహాయకారి యగును.

(2) విలువదుస్తులు ధరించువారు దేశాభిమాన పూర్వకనిర్బంధము నేర్పరచుకొని విలువవస్త్రములను నిరాకరించవలెను.

(3) స్వల్పవ్యయముతో జీవించుచు సౌఖ్యముయొక్క దురాదర్శములను త్యజించవలెను.

(4) ఎడతెగక తీవ్రమైన ఆందోళనము పట్టుదలతో జరుపవలెను.

(5) రుచులలో విప్లవము గలిగించుట మనప్రథమకర్తవ్యము. ఖాదీ ప్రచారమునకు ఖాదీని ధరించు వారందరును పూనుకొనవలెను.

(6) సన్నని నేతకును, చవుకధరలకును మోహపడరాదు.

(7) పెద్దపట్టణములయందును, పిన్న గ్రామములందును ఖాదీ డిపోలను స్థాపించి ప్రోత్సాహ మొనర్చవలెను.

(8) పట్టణములలో పరపతిసంఘములద్వారా ఖద్దరు చీటపదతిని వ్యాపింప చేయవలెను.

(9) సంవత్సరమునకు కావలసిన ఖాదీయంతయు ఒక్క పర్యాయముకొని నెలవాయిదాల ప్రకారము చెల్లించు వీలు బీదలకును, మధ్యరకము వారికిని, విద్యార్థులకును, కలుగజేయవలెను.

(10) ఋతుసంతలను సంచారదుకాణములను పెట్టి పెద్ద యాత్రాస్థలములలోను, ఉత్సవదినములలోను, గొప్ప సభలు జరుగుతావులలోను ఖాదీని అమ్మించవలెను.

(11) ప్రభుత్వమువారి సిబ్బందికి కావలసిన గుడ్డలన్నియు ఖాదీవియే కొనవలసిన దని ఆందోళన చేయవలెను.

(12) మ్యునిసిపల్-తాలూకా, జిల్లాబోర్డులు తమఆసుపత్రులలోను, పాఠశాలలలోను, యితరప్రతిష్ఠాపనలలోను ఖాదీని ప్రవేశపెట్టునట్లు చేయవలెను.

(13) ఖాదీ ప్రచారకులందరును, రాటమును దాని భాగములను బాగుచేయుటకును, ఏకుటకుచు, నేయుటకును కూడ సమర్థులై యుండవలెను.

(14) 5 గురుగల ప్రతికుటుంబములోను దినమునకు 2,3 గంటలు చొప్పున చర్ఖాను త్రిప్పుచుండినచో, ఆకుటుంబమునకు కావలసిన వస్త్రములన్నియు ఉత్పత్తి చేసికొనవచ్చును.

(15) పట్టణములలో రాట్నపుకళ్ళు లేర్పఱచి నూలు ఉత్పత్తిని ప్రోత్సహించవలెను.

(16) మూలధనమును వసూలుచేసియు, అరువు లిచ్చియు, ఇతరవిధముల సకాలమున సహాయము చేసియు లెక్కలనుజేర్చి దేశములో పరిస్థితు లెరిగిన ప్రచారకుల ద్వారా శాస్త్రజ్ఞానము వ్యాపింప చేయుటకై పైఅధికారమును చలాయించు కేంద్రసంఘనిర్మాణము కావింపవలెను.

(17) నూలువడుకునట్టి కర్షకుడు ప్రత్తిని ఆహారపదార్థముతో సమానావసరమైనదిగ భావించి, కేవలము అమ్మి లాభమును సంపాదించుటకే యని తలంచక, తన కవసరమైన చొకబట్టలను నిర్మించుకొనుటకై కూడ ఏర్పరచినట్లు భావించవలెను.

ఈ ప్రకారము మనకర్తవ్యమును నెరవేర్చినచో రాటము మనభుక్తికి సాధనభూతము కాగల దని రుజువగు చున్నది.

శ్రద్ధాభక్తులతో ఖద్దరుద్యమమును సాగించు నెడల శీఘ్రఫలితము కలుగకమానదు. ఇందుకు రుజువుకావలసినయెడల వినుడు. విదేశవస్త్రబహిష్కరణసంఘమువారు ఈ సంవత్సరం (1929 సం॥) మేనెలనుండియు తాము జరిపిన ప్రచార ప్రబోధములను గూర్చిన నివేదికను అఖిలభారతకాంగ్రెసు

కమిటీవారికి నివేదించిరి. ఆనివేదికలో ఈ క్రిందివిషయములు పొందుపరుపబడెను.

"49 స్థానికస్వపరిపాలనాసంఘముల వారును 5 మ్యునిసిపల్ సంఘములవారును విదేశవస్త్రములపై పన్నును విధించుట కంగీకరించిరి. సంయుక్తపరగణాలశాసనసభ వారు, కద్దరువస్త్రములనే గవర్నమెంటువారు వీలైనంతవరకు కొని తమవివిధశాఖలలోని నవుకరులదుస్తులకు వినియోగింపవలె ననెడి తీర్మానమును శాసనసభలో చేసియుండిరి. దిగుమతియైన విదేశపునూలుసరుకు గతసంవత్సరమున కంటె యీసంవత్సరము 4 కోట్ల 25 లక్షల రూపాయిలు విలువగల సరుకు అమ్మబడెను. గతసంవత్సరములో నిదేశాలమునకుగల మొత్తము అమ్మకముతో పోల్చినయెడల నూటికి 66 వంతున అమ్మకము యీసంవత్సరము హెచ్చెను. ఖద్దరువస్త్ర ఉత్పత్తి కూడ నూటికి 30 వంతున హెచ్చెను. 6 లక్షలరూపాయిల హెచ్చుసరుకు తయారుచేయబడెను."

ఈనివేదికయొక్క వివరములను గమనించినవారికి కద్దరుద్యమముయొక్క నియమములుగాని, కార్యక్రమముగాని కేవలమృగతృష్ణజలమువంటిది కాదని స్పష్టపడగలదు. ఇంక రాటము ముక్తికెట్లు సాధనభూతమగునో తెలిసికొనవలసియున్నది.

## రాటము - ముక్తిమార్గము.

రాటము ముక్తిమార్గము నిచ్చు నని శాస్త్రజ్ఞానము లేనివారు ఎంతగట్టిగా చెప్పినను, సామాన్యజనులకు నచ్చునట్లు చేయుట దుస్తరము. శాస్త్రమునకు ఆంగ్లభాషలో సైన్సు (Science) అని పేరు. కాన సైన్సుసిద్ధాంతములరీత్యా రుజువు చేయుట అవసరము. పాశ్చాత్యభౌతికశాస్త్రజ్ఞులైన జె. సి. బోసుగారు కద్దరునందు ధ్వనినివారకశక్తి యున్నదనియు, అద్దానివలన చిత్తశాంతి కలుగుననియు నిటీవల ప్రకటించి యున్నారు.

## జె. సి. బోసుగారి కద్దరు సిద్ధాంతము.

ఈసంవత్సరము నవంబరు 30 తేదీన జగదీశచంద్ర బోసుగారి పరిశోధనాలయముయొక్క వార్షికోత్సవము జరిగినది.

"బోసుగారి పరిశోధనాలయములో ప్రక్కనబోవు బండ్లగడబిడవలన నెవ్వరికిని తోచకుండెను. ఈపీడ నెటులైన నివారించుటకై బోసుగారు చాలరోజులనుండియు ప్రయత్నించుచుండిరి. చివరకు కద్దరులో ననుపమానమైన ధ్వని నివారకశక్తి యున్నటుల కనుగొనిరి. దానికై బోసుగారు మహాత్మాగాంధిగారి నభినందించిరి."

ఈప్రకారము వార్తాపత్రికలలో ప్రచురింపబడిన సంగతి సర్వులకు విదితమే. మహాత్ముడు కద్దరు పవిత్రమైన

దనియు, అయ్యాది జనులభక్తిమార్గమునకు తోడ్పడుననియు రుజువుచేసియుండిరి. ఇప్పుడు బోసుగారు కద్దరు ధ్వనినివారకమై జనులముక్తిమార్గమున కుపకరించునని రుజువుచేయుచున్నారు. ఇట్లుగాంధి, బోసుల సందేశములనుబట్టి రాటము భక్తిముక్తినిచ్చు ఇలువేలు పగుచున్నది. కాన ప్రప్రథమమున మనము అట్టిరాటపులక్ష్మికి వందనము లర్పించవలసియున్నాము.

సిద్ధిబుద్ధి ప్రదే దేవి భుక్తిముక్తిప్రదాయినీ,

మంత్రమూర్తే సదాదేవి మహాలక్ష్మి నమోస్తుతే॥

పాశ్చాత్యప్రకృతిశైస్త్రరీత్యా బోసుగారు కనిపెట్టిన సిద్ధాంతమును, మనపూర్వఋషులు వేదాంతశాస్త్రరీత్యా అనుభవపూర్వకముగ దెలిపియుండిరి. ఈ విషయమును మన మిప్పుడు విచారించవలసియున్నాము.

"కద్దరు ధ్వనినివారక మగుచున్నది."

అని బోసుగారు చెప్పిరి. ధ్వని యనగ శబ్దము. శబ్దము నివారక మగుచున్నదన్నప్పుడు, శబ్దము నిశ్శబ్ద మగుచున్నదని యర్థము. ఇది యెట్లు సాధ్యమగును? పంచభూతములలో సూక్ష్మతమమైనది (Subtlest) ఆకాశము లేక, అవకాశము (Space either) పంచభూతతత్వములను గ్రహించు జ్ఞానేంద్రియములలో ఆకాశతత్వమునకు సంబంధించినది శ్రోత్రేంద్రియము. మనస్సు శ్రోత్రేంద్రియమున సంబంధింపబడి

ఆకాశతత్త్వమున నిలిచియున్నంత వరకు శబ్దమును వినుచుం డును. ఆకాశముయొక్క గుణమే శబ్ద మగుటవలన అట్లు జరుగుట సంభవించును.

"ఆకాశస్య గుణ శ్శబ్దః"

అని యున్నది. ఆకాశములేని స్థాయికి మనస్సును ఏ యుపాయముచేత నైనను నెట్టగలిగితిమేని, మనకు శబ్ద ము వినిపించక నిశ్శబ్దము కలుగును. కుండలియొక్క అధో భాగమున మనస్సు సంచరించునప్పుడు శబ్దాదులను విషయము లను గ్రహించుచుండును. కానిమనస్సు ఊర్ధ్వముఖముగ నడు చునప్పుడు నిర్విషయమగును. శబ్దగుణప్రధానమైన ఆకాశ ములేని తావునకు మనసును నెట్టవలసియున్నాము. అట్టితా వు, ఒక్క బ్రహ్మపదార్థముతప్ప మరియొకటిలేదు. ఎట్లన

ఆకాశో హ్యావకాశశ్చ ఆకాశం వ్యాపితంచ యత్।
ఆకాశస్య గుణ శ్శబ్దో నిశ్శబ్దో బ్రహ్మ ఉచ్యతే॥

అని ప్రమాణవచనము కలదు. ఆకాశము సర్వత్ర వ్యాపించియున్నది. దానిగుణము శబ్దించుటయై యున్నది. కాని బ్రహ్మయందు ఆకాశముగాని దానిగుణమైన శబ్దము గాని లేదు. శబ్దమునుండి అశబ్దమునకు తీసికొని వెళ్ళి మనస్సు నచ్చట లయముచేయగల సాధన మేది? ప్రణవనాదాను సంధానము తప్ప అన్యము కాదు. ఈ సిద్ధాంతమును ముందుగ స్థిరపరచవలసియున్నాము.

ఓంకారధ్వనినాదేన వాయోః సంహరణాంతికం।
మనో యత్ర లయం యాతి తద్విష్ణోః పరమం పదం॥

మనోలయ మెచ్చట యగునో అయ్యదియే పరమ పదము. ఇయ్యది ఓంకార - నాదముచేత పొందనగును. అప్పుడు తన్మయత్వము కలుగును. అనగ మనస్సు తదాకారాకారిత మగును. ఎట్లన?

సకృ దుచ్చరితమాత్ర ఊర్ధ్వ మున్నామయతీ త్యోంకారః॥
—అథర్వశిఖోపనిషత్.

ఒక్కమా రుచ్చరించినమాత్రమున చిత్తము నూర్ధ్వ గతి నొందించును గనుక ఓంకార మని పేరు కలిగినది. అయితే యీ శబ్దమునకు కొందరు ప్రణవ మని పే రేల పెట్టిరి? అని ప్రశ్న రాకమానదు. అందుకు సమాధానమును వినుము.

ప్రాణాన్ సర్వాన్ పరమాత్మని ప్రణామయతీతి ప్రణవః॥

అనగా సకలప్రాణములను (ప్రపంచమునంతను) పరమాత్మయందు చేర్పించుటంబట్టి ప్రణవ మనంబడుచున్నది. దీనికి తారక మని మరియొక పేరుగలదు. ఏలనన,

సర్వేభ్యో దుఃఖేభ్యః సంతారయతీతి, తారణా త్తారః॥
—అథర్వశిఖోపనిషత్.

అనగ సమస్తదుఃఖభయములనుండి తరింపజేయునదిగా నుండుటంబట్టి తారణ మనబడును. తారణము చేయుట వలన తారక మనబడును. కాన ఓంకారనాదమే మోక్షము నీయదగిన సాధనము.

"ప్రణవో మోక్షదాయకః."

అని ప్రమాణము. ఏవస్తువునుగూర్చి మనము తదేక నిష్ఠ(Coecntration)తో ధ్యానించెదమో ఆ వస్తువుయొక్క స్వరూపమునే పొందుదుము. ఇయ్యది ప్రకృతిసూత్రము. తుమ్మెద ఒక పురుగునుబట్టి దాని నొక గూటిలో నుంచి ఆ గూటి కవాటమును మట్టితోపూడ్చి అచ్చట ఝుంకార నాదమును చేయుచుండును. గూటిలోని పురుగు ఆ ఝుంకారమును వినుచు ఆ నాదమొనర్చుచుండిన తుమ్మెదనే సదా స్మరించుచుండును. ఎందు కిట్లు చేయును ? ఎప్పుడు ఆ తుమ్మెద గూటిలో చొచ్చి తనను బాధించి చంపునో యను భీతిచేత ఆ పురుగు తుమ్మెదమీదనే తనమనస్సును కేంద్రీకరించును. (Focus) తదేకధ్యానమహిమచే, కొంతసేపటి కాపురుగు ధ్యేయమైన తుమ్మెదయొక్క ఆకారమును పొందును. ఇందు కనియే,

'యద్భావం తద్భవతి'

అనగ దేనిని భావించెదరో అదియే కాగలరు. అనెడి లోకోక్తి ప్రచారమం దున్నది. దీనినిబట్టి ఉపాసకులకు ధ్యాన మంత్రములతోబాటు ధ్యేయమూర్తులనుకూడ యేర్పాటు చేసిరి. ప్రకృతి (Nature) యందలి ఈరహస్యమును మన ప్రాచీనఋషులు అనేకవేలసంవత్సరములక్రింద పరిశోధించి దీనికి భ్రమరకీట న్యాయము అని పేరుపెట్టి, వేదాంతగ్రంథములయందు పలుతావులలో ఈన్యాయమును వక్కాణించిరి.

ఎట్లన—

క్రియాన్తరాసక్తి మపాస్య కీటకో
ధ్యాయన్ యథా నిత్యం హ్యావిభావ మృచ్ఛతి
తథైవ యోగీ పరమాత్మతత్త్వం
జ్ఞాత్వా సమాయాతి తదేకనిష్ఠయా॥

అనగ, ఏప్రకారము కీటకము భ్రమరమును ధ్యానించుచు భ్రమరమగుచున్నదో, ఆప్రకారమే యోగియగువాడు తదేకనిష్ఠతో పరమాత్మను ధ్యానించుచుండుటవలన పరమాత్మస్వరూపమునే బొందుచున్నాడు. అని శంకరభగవానులు వివేకచూడామణియందు దెల్పియున్నారు. ఈ యుపమానమున ధ్యాత=కీటకము; ధ్యేయము=భ్రమరము; ఉపమేయమున ధ్యాత=యోగి; ధ్యేయము=పరమాత్మ; కాని రెండింటికిని తదేకధ్యానము సమానమే. కీటకము భయముచేత ధ్యానించియుండ యోగి భక్తిచేత ధ్యానించియుండెను. ఈభ్రమరకీటన్యాయమును భద్రాద్రిరామదాసుగా రిట్లు వ్యక్తపరచియున్నారు.

చ॥ భ్రమరము కీటకంబు గొని పాల్పడి ఝూంకరణోపకారియై
భ్రమరముగా నొనర్చు నని పల్కుటజేసి భవాదిదుఃఖసం
తమ మెడలించి భక్తిసహితంబగు జీవుని విశ్వరూపత
త్త్వమునదరించుటే మరుదు దాశరథీకరుణాపయోనిధీ.

కాన ఓంకారమును ధ్యానించుటచే తన్మయత్వము నొంది ప్రాపంచికశబ్దాదులయెడ బధిరత్వ, మూకత్వ, అం

ధత్వ, ముగ్ధత్వ, పంగుత్వాదులను బొంది ముక్తి నొందగలము. ఈ కారణముచేతనే ఓంకారముయొక్క మహిమాతిశయము లను గూర్చి శాస్త్రము ముక్తకంఠముతో చాటుచున్నది.

ఏతదాలంబనం శ్రేష్ఠ మేతదాలంబనం పరం।
ఏతదాలంబనం జ్ఞాత్వా బ్రహ్మలోకే మహీయతే॥

ప్రణవము శ్రేష్ఠమైన ఆలంబనము. దీనివలన బ్రహ్మత్వము లభించును.

యావజ్జీవం జపే న్మంత్రం ప్రణవం బ్రహ్మణోవపుః।
హ్రస్వో దహతి పాపాని దీర్ఘో మోక్షప్రదాయకః।
ప్లుతస్తు సర్వసిద్ధ్యై స్యాత్ ప్రణవ స్త్రివిధ స్స్మృతః॥

బ్రహ్మస్వరూపమైన ఓంకారమంత్రమును జీవితకాల మంతయును మననము చేయనగును. దాని యుచ్చారణ (1) హ్రస్వము (2) దీర్ఘము (3) ప్లుతము అని మూడువిధ ములు. హ్రస్వోచ్చారణచే సర్వపాపములు నశించును. దీర్ఘ ముచే ముక్తి కలుగును. ప్లుతముచే సర్వసిద్ధులు బడయ నగును. జీవితకాలమునందేగాక ముఖ్యముగ మరణకాలము నందు ఎవడు ఏరూపమును స్మరించుచు దేహమును విడుచునో వాడు ఆరూపమునే బొందును అని సిద్ధాంతము కలదు.

యంయం వాపి స్మరన్ భావం త్యజ త్యన్తే కళేబరం।
తంత మేవైతి కౌన్తేయ సదా తద్భావభావితః॥

ఈ సిద్ధాంతము ననుసరించి మరణకాలమున పరమాత్మ ప్రతిపాదకమైన ఓంకారమునే ధ్యానించు నెడల అట్టివానికి

పరమాత్మస్వరూపము అనగ ముక్తియే లభించుననుట కీ క్రింది గీతా వాక్యము ప్రమాణము.

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మాం మనుస్మరన్।
యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిం॥

సామాన్యజనులేగాక కేవలఋషిసత్తములును, యతీశ్వరులును ఈ ప్రణవోపాసనయే తరణోపాయమని తలంచి దానినే అనుష్ఠించుచున్నారు. ఎట్లన,

యదక్షరం వేదవిదోవదన్తి విశన్తియద్యతయోవీతరాగాః।
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తే పదం సంగ్రహేణ
ప్రవక్ష్యే॥

అనగ ఋషిపుంగవులును, యతీశ్వరులును ఏమంత్రము నుచ్చరించుచున్నారో, మరియు దేనిని పొందుటకై వారు బ్రహ్మచర్యవ్రతము నవలంబించుచున్నారో అట్టి పవిత్రమైన మంత్రము ఓంకారమే యని, భగవాన్ వాసుదేవమూర్తి అర్జునున కుపదేశించియుండెను. ఈ కారణముచేతనే భగవంతుడు తాను ప్రణవమందు స్వయముగ నుండుచున్నా నని ప్రమాణముచేసియున్నాడు.

రసోహ మప్సు కౌంతేయ ప్రభాస్మి శశిసూర్యయోః।
ప్రణవ స్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు॥

ఓ అర్జునా! నీళ్ళయందలి రుచి నేనే. సూర్యచంద్రులయందలి కాంతి నేనే. వేదములయందు ప్రణవము నేనే.

ఆకాశమందలి శబ్దము నేనే అని అర్థము. మఱియు వేదము యొక్క ఆదియందును, అంతమునందును ఓంకారము చేర్చ బడియున్నందున ఆయ్యది వేదమునుకూడ పవిత్రముచేయ గలిగిన దెంచవలసియున్నది. ఎట్లన,

యో వేదాదౌ స్వరః ప్రోక్తో వేదాంతేచ ప్రతిష్ఠితః,
తస్య ప్రకృతిలీనస్య యః పరః స మహేశ్వరః॥

సర్వవైదికకర్మారంభమునందును ఓంకార ముచ్చ రింపబడుటచేతనే ఆ కర్మలు శుభావహము లగుచున్నవి. ప్రణవము ఆదియందులేని మంత్రముగాని, యజ్ఞముగాని, క్రియగాని నిష్ఫలములగుచున్నవి. ఈకారణముచేతనే పుణ్యా వాచనకర్మయందు మన మిట్లు చెప్పుచున్నాము.

యం కృత్వా సర్వవేదయజ్ఞక్రియాకరణకర్మారంభా శ్శుభా
శ్శోభనాః ప్రవర్తన్తే త మహ మోంకార మాదిం కృత్వా
భవద్భి రనుజ్ఞాతః పుణ్యం పుణ్యాహం వాచయిష్యే॥

మఱియు బాలురకు అయిదేండ్లప్రాయమున అక్షరా భ్యాస మొనర్చునపుడు ప్రథమమున వారికి,

"ఓమ్ నమ శ్శివాయ"

అను ప్రణవపంచాక్షరీమహామంత్రము నుపదేశించు చున్నారు. మనకు గోచరములగు అనంతకోటిబ్రహ్మాండము లను ఒక్కదేవుడే భరించుచున్నాడుగదా! ఇట్టి భారమును అత డేబలముచేత భరించుచున్నాడు? అతని కిట్టితేజ మెచట నుండి కలిగెను? అని కొందఱిట్లు ప్రశ్నించుచున్నారు.

కిం త ద్విష్ణో ర్బల మాహుః కా దీ ప్తిః కిం పరాయణం॥

అనగ విష్ణువున కా బల మెక్కడిది? ఆదీప్తి యెక్కడిది? ఈ ప్రశ్నలకు జవాబు వినుడు.

వాతా ద్విష్ణో ర్బల మాహుః అక్షరా ద్దీప్తి రుచ్యతే॥

—నారాయణసూక్తమ్.

అనగ విష్ణువున కట్టి బలము వాయువునుండి వచ్చెను. ఆదీప్తి అక్షరమైన ఓంకారమునుండి కలిగెను. అని యర్థము. మఱియు పతంజలియోగసూత్రములలో 27 వ సూత్రము.

"తస్య వాచకః ప్రణవః."

అని యున్నది. అనగ ఆ యీశ్వరునకు ఓంకారమే నామధేయము అని యర్థము. స్వామి వివేకానందరాజయోగమును గూర్చి వ్రాయుచు నిట్లు ప్రశ్నించిరి.

"Can there be a sound symbol that would represent naturally all the various sound-symbols that exist in the world?"

అనగ ధ్వనులన్నియు నుద్భవమగుటకు కడుశ్రావ్యమగు సహజధ్వని యేదైన నాధారభూతమై యుండెనా? అని యర్థము. ఈ ప్రశ్నకు స్వాములవారే ఇట్లు ప్రత్యుత్తర మిచ్చిరి.

"The word Aum (ఓమ్) is that sound-symbol which can very well be regarded as the basis of all sounds."

అనగ అట్టి సర్వధ్వనులకును ఆధారము ఓంకార మగుచున్నది యని నుడివిరి. ఈ కారణములన్నింటిని విచారించి

నప్పుడు ఓంకారమునందే సమస్తము నిమిడియున్నట్లు స్పష్ట పడుచున్నది. మఱియు సమస్తజ్యోతిర్మండలములకును ప్రకాశము నిచ్చు స్వయంజ్యోతి యేది?

త్రియఃకాలా స్త్రయోదేవా స్త్రయోలోకా స్త్రయస్స్వరాః,
త్రయోవేదాః స్థితా యత్ర తత్పరం జ్యోతి రోమితి॥

— యోగశిఖోపనిషత్.

అనగ దేనియందు సర్వకాలములును, సర్వలోకములును, సర్వస్వరములును, సర్వవేదములును గలవో అట్టి ఓంకారమే పరంజ్యోతియైయున్నది.

ఇంతవరకు జరిగిన విచారణనుబట్టి యేమి తేలినది? (1) సర్వమునకు ఓంకారమే మూలమనియు, (2) అట్టి ఓంకార నాదానుసంధానమే ("నిశ్శబ్దో బ్రహ్మ ఉచ్యతే" అన్నట్లు) బ్రహ్మత్వము నీయదగినదనియు స్థిరపడినది. ఇట్టి మహత్తుగల ఓంకారనాదము (శబ్దబ్రహ్మ) ఎక్కడ, పుట్టుచున్నది? (1) రాటచక్రమునుండియు, (2) బ్రహ్మాండచక్రమునుండియు, అయ్యది కలుగుచున్నది. ఆ రెండు చక్రములనుండియు ఒక్కే నాదము కలుగుచున్నదన్నప్పుడు ఒక దానియందు మరియొకటి యిమిడియున్నదేమో యని ప్రప్రథమమున నొకయూహ స్ఫురించకమానదు. ఇట్టి యూహ నిరాధారము కాదనుటకు రాటచక్రముయొక్క రెండు దృక్పథరూపములను (dual view points) విడదీసి ప్రత్యేకచిత్రపటములమూలమున విశదపరచుచున్నాము.


రాటచక్రము.
(అంగములు)
శ్రీ
1. దిమ్మ
2. ఇరుసు
3. ఆకులు
4. రాటసూత్రము
5. కార్పాసతంతువు
రాట-చక్రము.
పూర్ణమిదం
శ్రీ
1 దిమ్మ
2 ఇరుసు
3 ఆకులు
4 రాటసూత్రము
4 రాటసూత్రము
4 రాటసూత్రము
కార్పాసతంతువు


ప్రణవ చక్రము.
(అంగములు)
ఓమ్.
1. బ్రహ్మ
2. మాయ
3. జీవుని సంచారమార్గములు
4. బ్రహ్మసూత్రము
5. కర్మతంతువు
ఓమ్
ప్రణవ-చక్రము.
4 బ్రహ్మసూత్రము
4 బ్రహ్మసూత్రము
పూర్ణమదః
4 బ్రహ్మసూత్రము
1 బ్రహ్మ
2
(లోకబంధములు)
కర్మ తంతువు

# చిత్రపటములు.

## నెం 1 రు.

(a) శ్రీ
(b) రాటచక్రము
(c) భుక్తిమార్గము
(d) సాకారము
(e) పూర్ణమిదం
(f) పంచాంగ నిర్మితము

## నెం 2 రు.

(a) ఓం
(b) బ్రహ్మచక్రము
(c) ముక్తిమార్గము
(d) నిరాకారము
(e) పూర్ణమదః
(f) పంచాంగ నిర్మితము

## నెం 1 రు (రాటచక్రము)

### అంగనిర్మాణము

(1) ప్రథమాంగము=దిమ్మ
(2) ద్వితీయాంగము=ఇరుసు
(3) తృతీయాంగము =ఆకులు (చువ్వలు) పంచగోళములు
(4) చతుర్థాంగము=రాటసూత్రము
(5) పంచమాంగము=కార్పాసతంతువు (కద్దరునూలు)

## నెం 2 రు (బ్రహ్మచక్రము)

### అంగనిర్మాణము.

(1) ప్రథమాంగము=బ్రహ్మ
(2) ద్వితీయాంగము=మాయ
(3) తృతీయాంగము = మాయాకార్యము. జీవుని సంచారమార్గములు. పంచతత్వములు
(4) చతుర్థాంగము= బ్రహ్మసూత్రము
(5) పంచమాంగము= కర్మతంతువు (లోకబంధములు)

ఈ రెండు చిత్రపటములును ఒక్క వస్తువుయొక్క భిన్నదృక్పథములేగాని భిన్నవస్తువులు కావు. ప్రత్యేకనామములు గల్గియు ఏకవస్తువునె ప్రతిపాదించుచున్నవి. ఈ రెండింటియొక్క ఐక్యతను బోధించు నీక్రింది పోలికలు గమనింపతగియున్నవి.

(a) రెండును చక్రములే (రాటచక్రము - బ్రహ్మచక్రము)

(b) రెండింటిలోను అంగనిర్మాణము సమానమే=(పంచాంగములు)

(c) రెండుచక్రములును తంతువులనే పుట్టించుచున్నవి = { కార్పాసతంతు, కర్మతంతు

(d) రెండును ఒకేవిధమైన నాదమును చేయుచున్నవి= (ఓమ్)

(e) ఉపయోగించినచో రెండును ముక్తినిచ్చును = { ఆర్థికముక్తి, పారమార్థికముక్తి

(f) ఉపయోగపరచనియెడల రెండును అనర్థదాయకములగును= { దారిద్ర్యము, నరకము

పైన తెల్పిన ఆరుపోలికలను (Points of identity) ఈ క్రింద వివరముగ తెలిపి, రాటచక్రమే బ్రహ్మచక్రమనియు, ఒకదాని తత్వమును సంపూర్ణముగ గ్రహించినచో రెండవదాని తత్వము సువ్యక్తమగుననియు నిరూపించి, జె. సి. బోసుగారు నుడివినట్లు, కర్ధరుధ్వనినివారకమని రుజువు చేయుచున్నాము.

## నెం I పోలిక (రెండును చక్రములే.)

మొదటిదానికి రాటచక్రమనియు, రెండవదానికి బ్రహ్మ చక్రమనియు పేరు. ఒకటి భుక్తిమార్గమును రెండవది ముక్తి మార్గమును చూపుచున్నవి. భుక్తి (ఐశ్వర్య) సూచకమగు (శ్రీ) అను ప్రతీక మొదటిదానికిని ముక్తిసూచకమగు ఓమ్ అను ప్రతీక రెండవ దానికిని చేర్చబడియున్నవి. మొదటి దానియందు చక్రమున్నట్లు మన చర్మ చక్షువులకు గోచర మగుచునే యున్నది. రెండవదానియందుకూడ చక్రము గల దని రుజువు చేయవలసి యున్నది—సర్వభూతములును అన్న మువలన పుట్టుచున్నవి. అట్టి అన్నము మేఘము వలనను, మేఘము యజ్ఞము వలనను, యజ్ఞము సత్కర్మవలనను, సత్కర్మ వేదము వలనను, వేదము అక్షరుడైన బ్రహ్మము వలనను కలుగుచున్నవి. ఈవిధముగ బ్రహ్మమునుండి సమస్త భూతకోటియు పుట్టుచుఁ తిరిగి బ్రహ్మమునందే లయమగు చున్నది. ఇయ్యది చక్రాకారముగ జరుగుచున్నది. కాన దీనికి బ్రహ్మాండచక్రమని పేరు. నెం 3 రు చిత్రపటమునుజూడుము.

అన్నాద్భవన్తి భూతాని, పర్జన్యాదన్నసంభవః।
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః।
కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవం।
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్।
ఏవం ప్రవర్తితం చక్రం॥ ... ...... ...

—భ. గీ. అ. 3 శ్లో. 14, 15, 16.

ఈ గీతాపరిమాణము పైయర్థమును స్పష్టపరచు చున్నది.

నెం II రు పోలిక=రెండింటిలోను అంగనిర్మాణము సమానమే.

ఈ రెండును పంచాంగ నిర్మితములు. ఎట్లన,

(1) మొదటి అంగము=మధ్యగానుండు స్థిరభాగము.

(2) రెండవ అంగము=దాని నావరించుకొని యుండు, చలించు అస్థిరభాగము.

(3) మూడవ అంగము=అందుండి చొచ్చుకొని వచ్చు చువ్వలు. వీనిని అయిదు భాగములుగ ఖండించు అయిదు వలయములు.

(4) నాల్గవ అంగము = ఈ చువ్వలను చుట్టుకొని వచ్చు త్రాడు.

(5) అయిదవ అంగము = పైకారణాంగములవలన కలుగు కార్యము. (ఫలితము).

ఈ యంగనిర్మాణము రెండింటియందును యెట్లు సమానమో ధృవపర్చవలసి యున్నది.

రాటచక్రములో

(1) మొదటి అంగమునకు దిమ్మ అని పేరు. ఇది చలించక స్థిరముగా నున్నది చూడుడు. ఇది కదిలినయెడల రాటమే నిరుపయోగమగును. దీనిని యాధారపరచుకొనియే తక్కిన అంగములు తిరుగును.

(2) రెండవఅంగమునకు ఇరుసు అని పేరు. ఈయిరుసు తిరుగుచుండును.

(3) మూడవ అంగమునకు ఆకులు అని పేరు. ఈ యాకు లొక్కొక్కటి అయిదేసి కణుపులు కలిగియున్నవి. ఈకణుపులయొద్ద అయిదువలయములు వచ్చి చేరుచున్నవి. ఇరుసుతోబాటు యీ యాకులును తిరుగుచుండును. ఇవి యిరుసులోనుండి చొచ్చుకొని వచ్చినవి.

(4) నాల్గవ అంగమునకు రాటసూత్రము అని పేరు. ఈ సూత్రము ఆకులయొక్క చివరభాగములను చుట్టివచ్చుచున్నది. చక్రమునంతట కలియద్రిప్పుచున్నది.

(5) అయిదవ యంగమునకు కార్పాసతంతువు లేక కద్దరునూలు అనిపేరు. మొదటి నాలుగు అంగములును కారణములు (=Causes) అనబడును. ఈ యంగము కార్యము (=Consequence) అనబడును.

బ్రహ్మచక్రములో

(1) మొదటి అంగమునకు బ్రహ్మ, ఉత్తమపురుష, పరమాత్మ యని పేర్లు. ఇది స్థాణువు. చలించదు. శాశ్వతము, అనాది, అనంతము.

"సర్వోపాధివినిర్ముక్తం నిర్విశేషచిన్మాత్రం।
సదద్వైత మానంద మమాయం బ్రహ్మ॥
—సర్వసారోపనిషత్.

అనగ ఉపాధిరహితమై, సత్తామాత్రమై మాయ నతిక్రమించియుండు అఖండానందవస్తువు. దీనికి బ్రహ్మ యని పేరు. అని యర్థము. మఱియు,

అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యో ఽశోష్యఏవచ,
నిత్య స్సర్వగత స్థాణు రచలో ఽయం సనాతనః॥

అనగ ఈ యాత్మ సర్వవ్యాపకుడును. చలింపనివాడును, భేదింపబడనివాడును, సనాతనుడునునై యున్నాడు. మఱియు,

"అజో నిత్య శ్శాశ్వతో ఽయం పురాణః."

అనగ పుట్టుక లేనివాడును, నాశనము లేనివాడును, స్థిరరూపుడునునై యున్నాడు. ఈతడు రాటచక్రములోని దిమ్మను బోలియుండును. తాను తిరుగకయే తక్కిన భాగములను త్రిప్పుచుండును. ఎట్లన:—

ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే ఽర్జున తిష్ఠతి।
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా॥

భగవద్గీత అ. 18 శ్లో. 61.

అనగ ఈశ్వరుడు సర్వభూతములయొక్క హృదయస్థానములయందుండి తనమాయచే వాటినన్నింటిని యంత్రమువలె త్రిప్పుచున్నాడు.

(2) రెండవఅంగమునకు మాయ, ప్రకృతి, అజ్ఞానము, అవ్యక్తము, అక్షరుడు, కూటస్థుడు అని పేర్లు. ఇయ్యది

యింద్రియములకగోచరము, అస్థిరము, అనిత్యముకాని జ్ఞానోత్పత్తిపర్యంతము నిత్యము. ప్రవాహవత్తుగ శాశ్వతము. మఱియు అనాది; సాంతము.

శ్రుతి:-మాయానామ అనాది రంతవతీ వ్యవహార భేదవతీ యానవిద్య తే వస్తుత స్సా మాయా తత్స్వరూప మజ్ఞానమ్.
—సర్వసారోపనిషత్.

అనగ మాయ అనాదియు, సాంతమున్నై యున్నది. వ్యవహారదశయందు భేదించునది. ఏది వాస్తవముగ అనగ త్రికాలములయందును లేదో అదియే మాయ. అజ్ఞానమే దానిస్వరూపము. ఇది రాటచక్రములోని ఇరుసును బోలి యుండును.

(3) మూడవఅంగమునకు మాయాకార్యము, వికృతి, క్షరుడు అనిపేర్లు. మహదాది దేహములును, భూరాది సమస్తలోకములు నిందు గలవు. ఇవి మాయవలన బుట్టుచున్నవి. ఇరుసునుండి ఆకులు చొచ్చుకొని వచ్చినచందమున యీలోకములన్నియు మాయనుండి చొచ్చుకొని వచ్చినవి. ఇవి చలించును. నశించును. ఎండమావుల వంటివి.

మాయా మాయాకార్యం సర్వం మహదాది దేహపర్యంతం।
అస దిద మనాత్మకం విద్ధి మరుమరీచికాకల్పం॥

అనగ మాయయును, మాయాకార్యమైన మహత్తు మొదలు దేహపర్యంతముగల సర్వమును అసత్యము. ఎండ

మావులరీతి భ్రాంతికల్పితము. ఒక్కటియైన ప్రకృతి(మాయ) అనేకమై వికృతియైనది. ఎట్లన?

> మహాభూతా న్యహంకారో బుద్ధి రవ్యక్తమేవచ।
> ఇన్ద్రియాణి దశైకంచ పంచచేన్ద్రియగోచరాః॥
> ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సంఘాత శ్చేతనాధృతిః।
> ఏతత్ క్షేత్రం సమాసేన సవికారము దాహృతం॥
>
> భగవద్గీత అ. 18 శ్లో 6-7.

అనగ మహాభూతములును, అహంకారము, బుద్ధి, దశేంద్రియములు, మనస్సు, శబ్దస్పర్శాదులు, ఇచ్ఛాద్వేషాదులును వీనితోగూడిన యీ దేహములును వికృతి యనబడును. మఱియు,

> భూమి రాపో ఽనలో వాయుః ఖం మనో బుద్ధి రేవచ।
> అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా॥

ఏకమైయున్న భగవన్మాయ (ప్రకృతి) ఎనిమిదివిధములుగ భేదించుటచే వికృతియైన భూతసృష్టికి కారణమైనది. ఆయెనిమిదివిధభేదము లేవన-పృథివి అప్పు తేజము వాయువు ఆకాశము లను పంచమహాభూతములును, మనో బుద్ధి అహంకారములును మొత్తము ఎనిమిది. ఈ చక్రములోని అయిదు వలయములును పంచభూతతత్వములై యున్నవి.

ఇంతవరకు బ్రహ్మచక్రములోని మొదటిమూడు అంగములను విచారించితిమి. (1) బ్రహ్మ (2) మాయ (3) మాయాకార్యము. ఈ మూడింటికిని వేదాంతశాస్త్రమందు పురుష

(ఉత్తమ మధ్యమప్రథమపురుషలు) లని పేరు. ఈదిగువ చిత్రపటమును చూడుడు.



ఈ మూడుచక్రములయొక్క నామములను, వాని భావములను తెలుపుచున్నాము.

రాటచక్రములోని మూడు అంతస్థులు

=(1) దిమ్మ (2) ఇరుసు (3) ఆకులు.

ప్రణవచక్రములోని మూడు అంతస్థులు

(A) =(1) బ్రహ్మ (2) మాయ (3) మాయా కార్యము

(లేక)

(B) (1) పురుష (2) ప్రకృతి (3) వికృతి.

ప్రకృతిం పురుషంచైవ విద్ధ్యనాదీ ఉభావపి।
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్॥

— భగవద్గీత అ. 13 శ్లో. 20.

అనగ ప్రకృతియును, పురుషుడును ఈ రెండును నిత్యము లని తెలిసికొనుము. ప్రకృతి పురుషులవలన బుట్టిన గుణాదులను వికృతి యని తెలిసికొనుము.

(C) (1) క్షేత్రజ్ఞుడు (2) క్షేత్రము (3) క్షేత్రజము.

యావ త్సంజాయతే కించి త్సత్త్వం స్థావరజఙ్గమమ్ ।
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగా త్త ద్విద్ధి భరతర్షభ॥

— భగవద్గీత అ. 13 శ్లో. 27.

మొదటిపురుషుడు-క్షేత్రజ్ఞుడు; రెండవవాడు-క్షేత్రము; మూడవవాడు- ఈక్షేత్రక్షేత్రజ్ఞులకు బుట్టిన స్థావరజంగమాత్మకమైన విశ్వము అని తెలిసికొనుము.

(D) (1) బీజము (2) యోని (3) గర్భము(పిండము).

మమ యోని ర్మహ ద్బ్రహ్మ తస్మిన్గర్భం దధా మ్యహమ్।
సంభవ స్సర్వభూతానాం తతో భవతి భారత॥

— భగవద్గీత అ. 14 శ్లో. 3.

ఓయర్జునుడా! త్రిగుణాత్మకమైన మాయ నాయొక్క యోనియై యున్నది. ఆ యోనియందు నా బీజమునుంచగా నేర్పడిన సర్వభూతములును గర్భస్థపిండములై యున్నవి.

(E) (1) { పితా / తండ్రి } (2) { మాతా / తల్లి } (3) { పుత్రః / బిడ్డ }

సర్వయోనిషు కౌంతేయ మూర్తయస్సంభవన్తి యాః।
తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితా॥

అనగ సర్వయోనులును తల్లియగుచున్నవి. నేను బీజము నుంచు తండ్రి నగుచున్నాను. మా యుభయుల వలన సంభవించు సమస్తరూపములును బిడ్డ లగుచున్నారు.

— భగవద్గీత అ. 14 శ్లో. 4.

(F) (1) పురుషుడు (2) పరాప్రకృతి (3) అపర ప్రకృతి.

అపరేయ మితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్।
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్॥

— భగవద్గీత అ. 7 శ్లో. 5.

అనగ సమస్తజీవభూతములును నాయొక్క అపర ప్రకృతియై యున్నవి. ఇది నికృష్టమైనది. దీని కాధారభూతమైన నాపరాప్రకృతిని ఉత్కృష్టమైన దానినిగా తెలిసికొనుము.

పైన తెల్పబడిన A. B C. D. E. F. అను ఆరువిధములుగల నామరూపాదులచే పురుషుడు (ఆత్మ) వ్యక్తమగుచున్నాడు. ఒక్కొక్క అంతర్భాగములలో మూడు స్థాయిలు గలవు. కాని ఒక దానినుండి తక్కినవి పుట్టుచు, తిరిగి

అందులోనే లయమగుచుండును. రాటచక్రములో దిమ్మ నుండి ఇరుసును, ఆకులును కలుగుచు, తిరిగి ఆదిమ్మలోనికే ఇమిడిపోవుచున్నవి. మామూలుగ మనము చూచు రాటము లిట్లు కనుపించవు కాని, మహాత్మాగాంధిగారియొద్దనున్న రాటమును పరిశీలించి చూచినచో ఇరుసులను, ఆకులను మడిచి దిమ్మలోని కిమిడ్చులకు వీలుకలిగి యుండునట్లు బోధ పడగలదు. రాటపుపని ముగిసినప్పు డిట్లు జరుగును. కాని పని ఆరంభముకాగానే తిరిగి దిమ్మనుండి ఇరుసును, ఆకు లను బయటకు లాగి నూలును (తంతువులను) వడుకుదురు. ఈ ప్రకారముగనే ప్రణవచక్రమునందలి మూడు వలయము లలో మొదటిదియైన బ్రహ్మనుండి, రెండవదియైన మాయ యును, అందుండి మూడవదియైన జగత్తును ఆవిర్భవించుచు సృష్టికార్యము జరుపుచుండును. తిరిగి లయకాల మాసన్న మైనప్పుడు మూడవవలయమైన జగత్తంతయు, రెండవ వలయమైన మాయలోనికిని, జ్ఞానకాలమందు ఈమాయ మొదటి వలయమైన బ్రహ్మలోనికిని తిరోధానమగుచుండును. శాస్త్రవిచారణయందు సృష్టికాలమునకు పగలనియు, లయ కాలమునకు రాత్రి యనియు సాంకేతికములు గలవు.

అవ్యక్తా ద్వ్యక్తయ స్సర్వాః ప్రభవ న్త్యహరాగమే।
రాత్ర్యాగమే ప్రలీయ న్తే తత్రై వావ్యక్తసంజ్ఞకే॥
—భగవద్గీత అ. 8 శ్లో. 18.

అనగ పగటి ప్రారంభమందు (బ్రహ్మ మేల్కొను సమయమందు) అవ్యక్తమైన మాయనుండి వ్యక్తములగు

ప్రపంచములు కలుగుచున్నవి. రాత్రి ప్రారంభమునందు (బ్రహ్మ నిద్రించుసమయమందు) ఇవియన్నియు ఆమాయ లోనికే చేరిపోవుచున్నవి. బ్రహ్మ ఈ మాయకంటె విలక్షణుడై, నిత్యుడై, శాశ్వతుడై యున్నాఁడు. ఎట్లన,

పర స్తస్మాత్తు భావోఽన్యో ఽవ్యక్తోఽవ్యక్తా త్సనాతనః।
య స్సర్వేషు భూతేషు నశ్యత్సు నవినశ్యతి॥

—భగవద్గీత అ. 8 శ్లో. 20

అనగా బ్రహ్మ అవ్యక్తమైన మాయకంటె విలక్షణుడును, ఉత్తముడునై సర్వము నశించినను, తాను మాత్రము శాశ్వతుడై, సనాతనుడై నిలుచుచున్నాడు. అనగా అప్పుడు మూడు వలయములు కాన్పించక, ఒక్కటే పరిపూర్ణమైన వలయము కనుపించును. అనగ ఊర్ధ్వమందున్న మొదటివలయమును, మధ్యమందున్న రెండవ వలయమును, అధోభాగమందున్న మూడవవలయమును మాయమై ఈ మూడు స్థానములలోను ఒక్కటే పూర్ణము కనిపించును. ఊర్ధ్వాధోమధ్యమములు శూన్యములై, అంతటను పూర్ణమే యగును. ఎట్లన,

ఊర్ధ్వశూన్య మధశ్శూన్యం మధ్యశూన్యం యదాత్మకమ్।
సర్వశూన్యం తదాత్మేతి సమాధిస్థస్య లక్షణమ్॥

ఉత్తరగీత 1 అ. శ్లో 35.

పైన తెల్పిన దేశకాలశూన్యమైన పరిపూర్ణత్వము

ఇంద్రియమనంబులకగోచరము. కేవల సమాధిస్థితిని జెంద గలిగినవారికే గ్రాహ్యమగును.

ఊర్ధ్వపూర్ణ మధఃపూర్ణం మధ్యపూర్ణం యదాత్మకమ్।
సర్వపూర్ణం తదాత్మేతి సమాధిస్థస్య లక్షణమ్॥
—ఉత్తరగీత.అ. 1 శ్లో. 38.

ఊర్ధ్వాధోమధ్యశబ్దంబులచేత దేశకాలవస్తుపరిచ్ఛే దము వ్యావర్తించినది. పూర్ణశబ్దముచేత ఆ యా వస్తుపరిచ్ఛే దము శూన్యమని ద్యోతకమగుచున్నది. దేశకాలవస్తుపరి చ్ఛేదమైన దానికి అపూర్ణము(Finite) అనిపేరు. దేశకాల వస్తుపరిచ్ఛేదరాహిత్యమైనది పరిపూర్ణము (Infinite) అని పేరు. ఈ పూర్ణమునందే వ్యావహారికమందు మనము చెప్పు చున్న ఉత్తమ, మధ్యమ, ప్రథమ పురుషలను ముగ్గురు పురుషు లిమిడియున్నారు. భగవాన్ యేసు క్రీస్తుకూడా నిట్లే చెప్పిరి. (1) God, the father (2) God, the mother (Holy ghost) (3) God, the son అనగా,

(1) బ్రహ్మ = ఉత్తమపురుషుడు (God, the father)

(2) మాయ = అక్షరపురుషుడు
(God, the mother i.e. Holy ghost)

(3) మాయాకార్యము = క్షరపురుషుడు
(జగత్తు) (God, the son)

ఇందుకు ప్రమాణము,

> ద్వా విమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవచ।
> క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే॥
> ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః।
> యో లోకత్రియ మావిశ్య బిభ ర్త్యవ్యయ ఈశ్వరః॥
>
> —భగవద్గీత అ. 15 శ్లో. 16, 17.

అనగ బ్రహ్మచక్రమున క్షరుడనియు, అక్షరుడనియు ఇద్దరు పురుషులు కలరు. క్షరుడైనట్టి సమస్తభూతములును, లోకములును నశించును. మాయ, అక్షరుడు జ్ఞానోత్పత్తి పర్యంతము నశించడు. కాని ఈక్షరాక్షరపురుషు లిరువురకంటె అన్యుడగు ఉత్తమపురుషు డన్ననో ఎన్నటికిని నశించడు. సమస్తలోకములకును యీతడు భర్తయు, పరమాత్మయునై యున్నాడు. ఈముగ్గురకును ఇతరనామములుకూడ సాంప్రదాయసిద్ధములై యున్నవి.

| | |
|---|---|
| (1) బ్రహ్మ = నారాయణుడు | అనినామాం |
| (2) మాయ = అవ్యక్తము | తరములు |
| (3) మాయాకార్యము = బ్రహ్మాండము | గలవు. ఎట్లన, |

> నారాయణః పరో ఽవ్యక్తా దండ మవ్యక్తసంభవం।
> అంత స్త్వంత స్త్విమే లోకా స్సప్తద్వీపాచ మేదినీ॥

అనగ భూరాదిసమస్తలోకములును, జంబు, ప్లక్షాది సప్తద్వీపములును గల యీ బ్రహ్మాండము, అవ్యక్తమునుండి పుట్టినది. అవ్యక్తమున కతీతుడై బ్రహ్మ కలడు. ఈతడే

నారాయణుడు. ఈ భావమునే ఈ క్రిందిశ్రుతికూడ తెలుపు చున్నది.

శ్రు:- మహతోఽవ్యక్తముత్తమం, అవ్యక్తాత్పరః పురుషః॥

అనగ లోకాదులగు మహత్తత్వముకంటె అవ్యక్తముత్తమము. అవ్యక్తముకంటె పురుషుడుత్తముడు. అయితే ఇచ్చట ముగ్గురు పురుషులుండగ బ్రహ్మకే ఉత్తమపురుష నామ మెట్లు సార్థకమయ్యెనో తెలియవలసియున్నది. ఏల ననగ ఈతడు తనశక్తియైన రెండవపురుషుని (మాయను)వశ పర్చుకొని, మూడవపురుషుని (జగత్తును) సృష్టిచేయకయే చేసినవానివలె కనుపించుచున్నాడు. ఇంద్రజాలకుడు తనశక్తి చేత ఒకచెట్టును వాస్తవముగ పుట్టించకయే పుట్టించినట్లు కనుబరచుచున్నాడు. ఇదియే మాయ. ఇంద్రజాలకుడు చేసి నట్లే బ్రహ్మయు చేయుచున్నాడు. ఈకారణముచేతనే భగ వానునకు మాయకుడని పేరువచ్చినది. ఇంకొక దృష్టాంతము:- ఒక మట్టిముద్ద యున్నది. దానివలన కుండ, చట్టి, పిడత, మూకుడు మున్నగు అనేకవస్తువులు తయారుచేయబడెను. కుండ, చట్టి, పిడత, మూకుడు అనునవి నామరూపములే గాని వాస్తవముగ అచ్చటనున్నది మట్టి ఒక్కటియే. నామ రూపములు నిజమైనవి కావు. యథార్థమును మరుగుచేయు నట్టివై యున్నవి. జ్ఞానియైనవాడు కుండ, చట్టి మున్నగువాని లోని మట్టినే చూచును. కాని వికారములైన నామరూపము లచే భ్రాంతి జెందడు. కాని అజ్ఞానియైనవాడు మట్టిని చూడక కుండ, చట్టి మున్నగునవి మట్టికంటె భిన్నములైనవనియు

యథార్థవస్తువులనియు భ్రమించును. ఇదియే మాయాస్వరూపము. ఈ తత్వమును తెలిసికొనువానికి మృత్యువు లేదు. ఇదియే మోక్షమార్గము.

ఈ రహస్యమును ప్రతిపాదించు కొన్ని ప్రమాణములనీదిగువ కనుబరచుచున్నాము.

వేదాహ మేతం పురుషం మహాన్తం ఆదిత్యవర్ణంతమసస్తుపారే
సర్వాణిరూపాణివిచిత్యధీరఃనామానికృత్వాఽభివదన్యదాస్తే॥

అనగ ఆపురుషుడు తమస్సైన మాయ కవతలనుండి సమస్తభూతములను సృష్టిచేసి, వానికి పేరుబెట్టి వ్యవహరించుచున్నట్లు కనుపించుచున్నాడు. ఈతడు మహాపురుషుడని నేను తెలిసికొనుచున్నాను.

అజాయమానో బహుధా విజాయతే॥

అతడు పుట్టించనివాడయ్యును సర్వమును పుట్టించినట్లు కనబడుచున్నాడు. మఱియు,

అజమపి జనియోగం ప్రాపదైశ్వర్యయోగాత్॥

తాను పుట్టనివాడయ్యు యోగమాయచే పుట్టినట్లు అగుచున్నాడు.

మాయాకల్పితదేశకాలకలనావైచిత్ర్యచిత్రీకృతం।
మాయావీవవిజృంభయత్యపిమహాయోగీవయస్స్వేచ్ఛయా॥

ఇంద్రజాలకుడును, యోగియును కల్పించురీతిగా చిత్రవిచిత్రమైన యీ దేశకాలనిమిత్తాదులతోఁగూడిన జగత్తును భగవానుడు కల్పించినాడు.

యథాసౌమ్యై కేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యా ద్వాచారంభణం వికారో నామధేయం మృత్తికే త్యేవ సత్యం॥ —ఛాందోగ్యోపనిషత్.

మట్టిచే చేయబడిన కడవలు, కుండలు మున్నగునవి మట్టికంటె భిన్నములు కానట్లు పరమాత్మవలన కలిగిన ఈ నామరూపజగజ్జాల మంతయు పరమాత్మకంటె వేరుగాదు. కాన సర్వభూతములను పరమాత్మగా భావింపవలెను.

త మేవం విద్వా నమృత ఇహ భవతి
నాన్యః పంథా విద్యతే ఽయనాయ॥

ఈప్రకారముగ ఎవడు తెలిసికొనుచున్నాడో వాని కిచ్చటనే ముక్తి కలుగుచున్నది. ఇంతకంటె తరణోపాయము వేఱు లేదు.

(4) నాల్గవ అంగమునకు బ్రహ్మసూత్ర మని పేరు. సూత్రాత్మ యని కూడ గలదు. ఈ సూత్రాత్మ లేనియెడల లోకములును అందలి పదార్థములును తమ బిగువునువదలి, రాలిపోవుట తటస్థించును. ఈ సూత్రాత్మయొక్క శక్తికి Power of Gravitation అని పేరు.

మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ,
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ॥
భగవద్గీత అ. 7 శ్లో. 7.

ఓ యర్జునా ! . నాకంటె శ్రేష్ఠమైన ఇతరకారణ సూత్రమేదియు లేదు. దారము నను రత్నములు, ముత్యా

ములు గుచ్చబడినట్లు నాయందీసర్వముచు గుచ్చబడి యున్నది. ఒక ముత్యాలహారములో మధ్యనుండు దారమును లాగివేసినయెడల ముత్యము లొకదానితో నొకటి సంబంధమును వీడి జలజల రాలిపోవునట్లు, ఈ బ్రహ్మాండములోని భూతజాలముల కన్నింటికిని ప్రాణశక్తియై ఆధారభూతమైన ఈశ్వరచైతన్యమే ఈ బ్రహ్మసూత్రము. ఈ సూత్రాధారముచేతనే సృష్టిస్థితి ప్రళయాది లోకవ్యాపారక్రియలు నడుచుచున్నవి. తద్వత్తుగ రాటచక్రములోని రాటసూత్రమే లేని యెడల రాటపుపని నిలిచిపోవునుగదా!

(5) అయిదవ అంగమునకు కర్మతంతువు అని పేరు. లోకములో ఒకనికి తల్లి, తండ్రి, బిడ్డ, గురువు, శిష్యుడు, వర్ణము, ఆశ్రమము, పెద్ద, పిన్న, పుణ్యము, పాపము, స్త్రీ, పురుష, బంధము, మోక్షము మున్నగు నానావిధ కర్మబాధములను కలిగించునవి వాని పూర్వకర్మతంతులే అయి యున్నది. ఈకర్మ ప్రకృతిగుణములగు సత్వరజస్తమోగుణములచే పుట్టబడి జీవుని బంధించుచున్నది. ఎట్లన,

సత్వం రజస్తమ ఇతిగుణాః ప్రకృతిసంభవాః,
నిబధ్నన్తి మహాబాహో దేహే దేహిన మవ్యయం॥

అనగ మాయవలన బుట్టిన గుణత్రయములును వాని కార్యములును ఆత్మను బంధించుచున్నవి. మఱియు,

ఆశయా బద్ధతే లోకః కర్మణా బహుచింతయా॥

జీవులు ఆశాపాశములచేతను కర్మసూత్రములచేతను కట్టుబడి,

గహనా కర్మణో గతిః॥

అన్నట్లు కర్మయొక్క గతి అగోచరమై అందుండి తప్పించుకొనజాలక అల్లాడుచున్నారు.

శ్రుతి:-అజ్ఞానమితిచ రజ్జుసర్పభ్రాంతి రివాద్వితీయే సర్వాను స్యూతే సర్వమయే బ్రహ్మణి దేవ తిర్యఙ్నర స్థావర స్త్రీ పురుషవర్ణాశ్రమబంధమోక్షోపాధినా నానాభేద కల్పితం జ్ఞాన మజ్ఞానమ్॥ —నిరాలంబోపనిషత్.

అనగ అద్వితీయ మైనటువంటిన్ని బ్రహ్మమునందు రజ్జుసర్పభ్రాంతి (త్రాటినిజూచి పాము అనుకొను) రీతిగా దేవమానవ, తిర్యక్, స్థావర, స్త్రీ, పురుష, వర్ణ, ఆశ్రమ, బంధ, మోక్షములు మొదలైన నానాభేదములను కలిగించెడి తెలివియే అజ్ఞానము. రాటచక్రమునందు ప్రత్తినుండి నూలు వచ్చుచుండును. బ్రహ్మచక్రమున మాయనుండి భార్యాభర్త మున్నగు కర్మబంధములు కలుగుచుండును. నూలు ఒకని దేహమును కప్పి అతని నిజరూపమును మరుగుపరచు చందమున, ఈ కర్మబంధములు ఆత్మను కప్పివేసి, నిజస్వరూపమును మరుగుపరచి అజ్ఞానమున ముంచి వేయుచున్నవి.

ఇంతవరకు బ్రహ్మచక్రములోని అయిదు అంగములను గుఱించి కొంత తెలిపియుంటిమి. కాని మూడవ అంగములోని చువ్వలనుబోలు జీవుని సంచారమార్గములను గూర్చి

యు, అయిదువలయములను బోలు పృథివ్యాది పంచతత్వ ములనుగూర్చియు వివరించినగాని వానియథార్థము బోధపడ జాలదు. అవ్యక్తమని పిలువబడు మాయనుండి పొడుచుకొని వచ్చి బ్రహ్మచైతన్యము, పాంచభౌతికతత్వము లను అయిదు స్థాయిలను దాటి తుదకు పృథివీభూతము (Grossmatter) చేరుచున్నది. ఆ బ్రహ్మతేజము అనంతకిరణముల మూలమున మాయను ఛేదించుకొని లోకాదులగుండా ప్రవహించు చున్నది. ఇవియే జీవులసంచారమార్గములు.

జీవులప్రాచీనకర్మ ననుసరించి ఇట్లు జరుగుచుండును.

ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః,
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృ తే ర్వశాత్॥
—భగవద్గీత అ. 9 శ్లో.8 .

అనగ స్వకీయమైన మాయను స్వీకరించి అస్వతం త్రులైన సకలభూతజాలములను వారివారి ప్రాచీనకర్మ సూత్రముల ననుసరించి నేను మాటిమాటికి సృజించుచున్నాను అని యర్థము. జీవు లీ ప్రకారము నామాయనుండి సృష్టి కాలమున వెడలుచు, లయకాలమున తిరిగి నామాయలో అంతర్భూతు లగుచున్నారు. ఎట్లన,

సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాన్తి మామికామ్।
కల్పక్షయే పున స్తాని కల్పాదౌ విసృజా మ్యహమ్॥
—భగవద్గీత . 9 శ్లో 7.

జీవులయొక్క యీ సంచారమార్గములు, చక్ర ములో చువ్వలుగ చూపబడెను. ఈ చువ్వలయొక్క మధ్య

కణుపులు పాంచభౌతికపదార్థముయొక్క ఆకాశ, వాయు, తేజ, అప్పు, పృథివీ యను పంచతత్వములను చూపు చున్నవి. ఈయైదుతత్వములనుండి సత్య, తపో, జన, మహత్, సువక్. భువర్, భూలోకములు ఏడు వరుసగ కలుగుచున్నవి. ఒక్క దీపకళనుండి అనేకవిస్ఫులింగములు బయల్వెడలు చందమున ఏకమై, అద్వితీయమైన బ్రహ్మమునుండి అనేకజీవాత్మలు పాంచభౌతికలోకములగుండా బయలువెడలుచున్నవి.

యథా సుదీప్తా త్పావకా ద్విస్ఫులింగా
సహాస్రశః ప్రభవన్తే సరూపాః।
తథా ఒక్షరా ద్వివిధాః సౌమ్యభావాః ప్రజాయన్తే॥

ఇట్లు బ్రహ్మచైతన్యము అనంతకిరణములుగ ప్రవహించుచున్నను, పటమునందు చిత్రలేఖనాసౌలభ్యము కొరకు 16 (పదునారు) కిరణములు మాత్రమే యుదహరింపబడినవి. ఇంకను ఈపటములోని చువ్వలమధ్యనుండు అయిదు కణుపులను గూర్చి తెలుపుట యవసరము. ఇవి పాంచభౌతిక పదార్థము (Matter) యొక్క అయిదు స్థాయిల (states of existence) ను తెలుపును.ఇయ్యవి చక్రమునందు అయిదు వలయములుగ చూపబడినవి. ప్రతిజీవియు ఈ అయిదు స్థాయిలను దాటి భూలోకమునకు రావలసియున్నది. పైన 16 కిరణములును 5 స్థాయిలను దాటునుగదా ! ఈ అయిదు స్థాయిలకు పేర్లేమియని అడిగినప్పుడు ఏపేర్లతో పిలిచిననుసరే ఒక స్థాయికంటె మరియొకటి పైనుండి క్రిందకు వచ్చునప్పుడు

స్థూలాతిస్థూలమై యున్నదనియు, క్రిందనుండి పైకిపోవున ప్పుడు సూక్ష్మాతిసూక్ష్మమై యున్నదనియు మాత్రము తెలిసికొనుట యవసరము. ఎట్లన,

అయిదుస్థాయిలు వలయములు క్రిందనుండి పైకి

| కిరణములు | 1 Gross | 2 Subtle | 3 Subatomic | 4 Atomic | 5 Superatomic |
|---|---|---|---|---|---|
| 1 | స్థూల | సూక్ష్మ | కారణ | మహాకారణ | కారణాతీత |
| 2 | బ్రహ్మ | విష్ణు | రుద్ర | మహేశ్వర | సదాశివ |
| 3 | అకార | ఉకార | మకార | అర్థమాత్ర | అర్థమాత్రాతీత |
| 4 | అవిద్యా | విద్యా | ఆనంద | తురీయ | తురీయాతీత |
| 5 | విశ్వ | తైజస | ప్రాజ్ఞ | ప్రత్యగాత్మ | పరమాత్మ |
| 6 | సద్యోజాత | వామదేవ | అఘోర | తత్పురుష | ఈశాన |
| 7 | పృథివీ | అప్పు | తేజ | వాయు | ఆకాశ |
| 8 | న | మః | శి | వా | య |
| 9 | ముక్తా | విద్రుమ | హేమ | నీల | ధవళ |
| 10 | బాల్య | కౌమార | యౌవన | వార్ధక | మరణ |
| 11 | తత్పద | త్వంపద | అసిపద | అతీతపద | నిజపద |
| 12 | ఆధార | యోని | నాభి | హృదయ | ముఖ |
| 13 | సత్ | చిత్ | ఆనంద | నిత్య | నిర్మల |
| 14 | అస్తి | భాతి | ప్రియ | నామ | రూప |
| 15 | ప్రాతః | సంగమ | మధ్యాహ్న | అపరాహ్ణ | సాయం |
| 16 | జాగ్రత్ | స్వప్న | సుషుప్తి | తురీయ | తురీయాతీత |

ఒకేపదార్థము అయిదు స్థాయిలుగ నుండుచు, తన (property) లక్షణమునకు హాని లేకుండ యుండగలదు. ఇం

దుకు నిదర్శనము:— జలము ($H_2O$) అయిదు స్థాయిలుగనుండ గలదు. అయిదు స్థాయిలలోను ($H_2O$) మాత్రమే కలదు. ఎట్లన,

$H_2O$ యొక్క స్థాయిలు.

(1) గడ్డమంచు = బహుకఠినముగ నుండు స్థాయి.
(2) నీరు = గడ్డమంచుకంటె పలచనగనుండు స్థాయి.
(3) ఆవిరి = నీటికంటె పలచనగ నుండు స్థాయి.
(4) సూక్ష్మావిరి = ఆవిరికంటె పలచనగనుండు స్థాయి
(5) సూక్ష్మతమావిరి = సూక్ష్మావిరికంటె పలచనగ నుండు స్థాయి.

ఈ అయిదు స్థాయిలును అయిదు పదార్థములుగ సామాన్యజనులకు కన్పించుచున్నను, శాస్త్రజ్ఞుని దృష్టికి (scientists eye) $H_2O$ (జలము) అను ఒక్కపదార్థమే కనుపించును. అజ్ఞానియొక్క దృష్టికి (1) గడ్డమంచు (2) నీరు (3) ఆవిరి (4) సూక్ష్మావిరి (5) సూక్ష్మతమావిరి అని అయిదు భిన్నవస్తువులు కన్పించును. కాని జ్ఞానియొక్క దృష్టిలో జలము ($H_2O$) అను స్థిరమైన ఏకపదార్థమే యుండును. అజ్ఞాని మారునట్టి నామరూపములను చూచుచుండ జ్ఞాని మారనటువంటి స్వరూపమునే చూచుచుండును. జ్ఞానిదృష్టికి తా నేపదార్థమును చూచినను ఆత్మయొక్కటే కాన్పించు

చుండ, అజ్ఞానియొక్క దృష్టికి అనంతనామరూపములు గల జగత్తు కన్పించుచుండును. ఈ నామరూపములు క్షణక్షణ మును మారుచుండును. ఇవి పదార్థములు గావు. వేషములు, దృక్పథములు (view points), మానసికకల్పనలు (idias) కాన (delusion) భ్రమ యనబడును. 'వేషములు' అని చెప్పినప్పుడు ఎవరియొక్క వేషములు? అని ప్రశ్న వచ్చును. ఆత్మయొక్క వేషములు అని చెప్పవలసియుండును. ఆత్మ (=Noumenon) సత్యము జగత్తు (Phenomenon) అసత్యము లేక మిథ్య యని తేలుచున్నది.

"బ్రహ్మ సత్యం జగ న్మిథ్యా."

అను శ్రుతివాక్యము దృఢపడుచున్నది. ఆత్మజ్యోతి యొక్క అనంతకిరణములు (జీవాత్మలు) పైనచెల్పిన అయిదు స్థాయిలను దాటి భూలోకమును ప్రవేశించు క్రియకు ఆవిర్భావము (Evolution) అని పేరు. జీవాత్మ లిట్లు భూలో కయాత్రను ముగించుకొని భువర్లోక, సువర్లోక, మహర్లోకాది సప్త ఊర్ధ్వలోకములకు నిర్గమించు క్రియకు తిరోభావము (involution) అని పేరు. జీవుని ఆవిర్భావ, తిరోభావము లను జూపు చక్రము నీదిగువ కనుపర్చుచున్నాము.

(1) జీవాత్మ పైనుండి క్రిందకు దిగుక్రియ = Evolution
(ఆవిర్భావము, జననము ఉయ్యాల)

(2) క్రిందనుండి పైకి పోవు క్రియ = Involution
(తిరోభావము, మరణము, జంపాల.)

నెం III. రు పటము.




ఇట్లు స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణ, కారణా
తీతములు లేక పృథివి, అప్పు, తేజో, వాయు, ఆకాశములను
అయిదు తత్వములు, భూః, భువః, సువః, మహః, జనః, తపః,
సత్య అను ఏడులోకములుగ విభజనములైనవి. అందు
జీవాత్మ ఆరోహణావరోహణములను సదా జరుపుచుండును.
ఒక్క సూర్యకిరణము త్రికోణాకారమైన అద్దము (prism)
గుండా ప్రవహించినచో ఏడురంగులు (V. I. B. G. Y. O. R.)
ఊదా, నీలి, నీల, ఆకుపచ్చ, పసుపుపచ్చ, నారింజ, ఎఱుపు
అను ఏడురంగులుగ చీలునట్లు, ఒక్క ఆత్మకిరణము త్రికోణా

కారమైన ఒక అహంకారము (అంతఃకరణము) గుండా ప్రిస రించునప్పుడు. (సత్య, తపో, జన, మహా, సువర్, భువర్, భూ) అను ఏడులోకములయందు ఏడుకిరణములుగ చీలిపోవు చున్నది. ఈ క్రిందిపటమును చూడుడు.

(నెం IV. ఢ) పటము.







ఇట్లు ఒకటి అనేకమగుటకు కారణమేమి? కాంతి కిర

ణమున కన్గొనవచ్చు ఉపాధియొక్క స్థితిగతులనుబట్టి అట్లు తటస్థించును. ఆయుపాధి ఏకముఖముగ నుండినచో ఒక కిరణము అనేకములుగ చీలక యుండును. కాని ఆయు పాధి భిన్నముఖములై యుండినందున అనేకత్వము కలుగు చున్నది. ఈ యనేకత్వమును పోగొట్టవలెనన్న ఉపాధిని తిరిగి ఏకముఖముగ నుండునట్లు చేయవలసియుండును. అనగ పైన తెల్పిన ఉపమానములో త్రికోణపు టద్దమును ఏకము ఖపు టద్దముగా చేసినన, ఉపమేయములో అనేకాగ్రములు గల అంతఃకరణమును ఏకాగ్రత జెందునట్లు చేసినను, ననే కత్వముపోయి యేకత్వము సిద్ధించును. ఈక్రియకు యోగ శాస్త్రమునందు చిత్తవృత్తి నిరోధము (Concentrative or focussing) అని పరు.

పైన తెల్పిన యేడులోకములయందు జీవాత్మ ఆరోహ ణావరోహణములను జరుపుచు, సుడిగుండములోబడి తిరు గుచు బైటకు పోజాలని పురుగుచందమున, సంసారచక్ర మున దగుల్కొని వర్తించుచుండును.

భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢానిమాయయా॥
—భగవద్గీత అ. 18 శ్లో. **61.**

అనగా తనశక్తిచే సర్వభూతములను యంత్రమువలె త్రిప్పుచున్నాడు. మఱియు,

సంసరతి అనయా జీవః ఇతి సంసృతిః-అహంకారాది ప్రపం చః—స ఏవచక్రం భ్రమతి ప్రత్యహం ఆవిర్భావతిరో భావాభ్యాం పునః పునః ఆవర్తతే॥

అనగ చక్రాకారముగ తిరుగునట్టి జీవుని యాత్ర సంసృతి లేక సంసారము అనబడును. ఇదియంతయు మాయ యనబడు 2 వ అంగముచేత చేయబడుచున్నది.

నెం III వ పోలిక. రెండుచక్రములును తంతువులనే పుట్టించుచున్నవి.

రాటచక్రము కార్పాసతంతువు(నూలు)ను కలిగించుచున్నది. బ్రహ్మచక్రము కర్మతంతువు (సంసారబంధము)లను పుట్టించుచున్నది.

నెం IV వ పోలిక. రెండును ఒకేవిధమైన శబ్దమును జేయుచున్నవి.

రాటము తిరుగునప్పు డేశబ్దము కలుగుచున్నదో బ్రహ్మచక్రముతిరుగునప్పుడును ఆశబ్దమేకలుగుచున్నది. రాటము తిరుగునప్పుడు ఓమ్ - ఓమ్ - ఓమ్ అని దీర్ఘఘంటానాదము వినబడుట యెల్లరకును దెలిసిన విషయమే. ఇకను బ్రహ్మాండచక్రము పనిచేయుచున్నప్పుడును అట్టి ఓంకారనాదము కలుగుచున్నదా యని రుజువు కాలసియున్నది. Harmony of spheres అని ఆంగ్లభాషలో చెప్పబడుదానికి బ్రహ్మాండముల శృతి యని మనము చెప్పుచున్నాము. వేదాంతశాస్త్రము దీనికి శబ్దబ్రహ్మ లేక నాదబ్రహ్మ యని నామం బిడెను. ఓమ్ అను ప్రణవనాదము మనకు బాహ్యమందును, ఆంతరమందును వినబడుచున్నది. బాహ్యమున

నిశ్శబ్దస్థానమునను, బహుశబ్దస్థానమునను వినబడుచున్నది. చెవులు తెరచినను, మూసినను ఆంతరమున అట్టి శబ్దమే విన వచ్చుచున్నది. ఎట్లన:—

(1) బాహ్యమున (a) నిశ్శబ్దస్థానము = శబ్దమేమియు లేని ఏకాంతస్థలమున గూర్చుండి ఇతరఆలోచనలను మనస్సునుండి పారద్రోలి ఏకాగ్రచిత్తముతో మన మాలకించినచో ఓమ్ అను శబ్దము వినబడును.

(b) బహుశబ్దస్థానము = బహువిధశబ్దములు నిరంతరము మోగుచుండెడి ఒక సంత (fair) కు కొంచెము సమీపమున గూర్చుండి తదేకనిష్ఠతో నాలకించినచో మనకు ఓమ్ అను శబ్దము వినబడును.

(2) ఆంతరమున (a) చెవులు తెఱచిపెట్టినను, మనము వాయువిమానములో పయనమగునప్పుడు గాని, జలాంతర్గాములలో పోవునప్పుడు గాని, పంచాగ్నిమధ్యమం దుండినప్పుడు గాని మనకు ఓమ్ అను శబ్దము వినబడును. మఱియు వాయువు వీచునప్పుడును, జలము ప్రవహించునప్పుడును, అగ్ని ప్రజ్వలించునప్పుడును, సముద్రము ఘోషించునప్పుడును, వర్షపాత మగునప్పుడు

ను, మేఘము గర్జించునప్పుడును, పక్షులం
పాడునప్పుడును పరిశాంతమనస్సుతో
వినినచో ఓమ్ అను శబ్దము కలుగును.

(b) చెవులు మూసికొని, షణ్ముఖీ
ముద్రను ధరించి వినునప్పుడు దశవిధ
ప్రణవనాదములు వినబడును.

మఱియు పిపీలికాదిబ్రహ్మపర్యంతముగల సకలజీవ రాసులయొక్క ముక్కురంధ్రములగుండా శ్వాస నడుచునప్పుడే శబ్దము కలుగుచున్నదో వినుడు. ప్రతినిశ్వాసము (Inhalatation) నందును, సో అని ధ్వనించును. ప్రతి ఉచ్ఛ్వాసము (Exhalatatin) నందును, హం అని శబ్దము కలుగుచుండును. కాన నిశ్వాసోచ్ఛ్వాసములమూలమున సో - హం అని ముక్కురంధ్రములగుండా అప్రయత్నముగ శబ్దము కలుగుచున్నది. దీనికే హంసగాయత్రి యనియు, అజపాగాయత్రి యనియు పేర్లు.

హకారేణ బహి ర్యాతి, సకారేణ విశే త్పునః ।
హంసహంసే త్యముం మంత్రం, జీవో జపతి సర్వదా॥

అనగ ప్రతిజీవుడును, నాసాపుటములగుండా శ్వాసను లోనికి పీల్చునప్పుడు సో (సకారేణ) అనియు, బయటకు విడుచునప్పుడు హం (హకారేణ) అనియు శబ్దము చేయుచు, ఎల్లప్పుడును హంసమంత్రమును జపించుచున్నాడు. ఆరోగ్య

దేహధారులు దినమున కిట్లు 21,600 శ్వాసలు జరుపుచుం దురు. ఎట్లన,

"ఏకవింశతిసహస్రిషట్ఛతాధికసంఖ్యాఽజపామం త్రానుష్ఠానం."

అనగ 21,600 పర్యాయములు అజపాగాయత్రి అనుష్ఠించబడును. సో - హం అను వర్ణములలో స్ - హ్ అను హల్లులు (Consonants) ను, ఓ - ం అను అచ్చులు (vowels) ను కలవు. అందు నిర్జీవములైన స్ - హ్ అను హల్లులను మినహాయించినచో జీవసహితములైన ఓ + ం అను అచ్చులు మిగులును. దీనికి ఓం అనియు, ఓంకార మనియు, ప్రణవమనియు పేర్లు. కావున ప్రతిజీవియు ఓమ్ అను మహామంత్రమును అప్రియత్నముగ శ్వాసరూపమున ఉచ్చారణచేయుచునే యున్నది. ఈవిధముగ సకలచరాచర బ్రహ్మాండమంతయు, బాహ్యాభ్యంతరముల యందు ఓమ్ అను శబ్దముతో నిండియున్నది. ఆశబ్దము లేనిస్థలము సూది మొనయంతైనను లేదు.

ఓతప్రోతసమస్తవస్తునిచయం ఓం కార బీజాక్షరం॥

అనగ ఓమ్ అను నాదములో సమస్తమును పడుగు పేకవలె చిక్కగా నేయబడి యున్నది అని యర్థము. కాన రాటము తిరుగునప్పు డేశబ్దము కలుగుచున్నదో, బ్రహ్మాండ చక్రము తిరుగునప్పుడును ఆశబ్దమే వినబడుచున్న దని ధృవ పడినది.

ఇంతవరకు ఓంకార మను ప్రణవముయొక్క నాద భాగము అనగ శబ్దభాగము మాత్రమే వివరింపబడినది. ఈ భాగమునకు నాదబ్రహ్మము లేక శబ్దబ్రహ్మమనియు పేర్లు గలవు. అట్టినాదము గాని శబ్దముగాని లేనట్టి భాగమికను వివరింప బడవలసియున్నది. శబ్దించు ఓంకారము దేశ కాల వస్తు పరిచ్ఛేదమై యున్నది. నిశ్శబ్దమగు ఓంకారము దేశకాలాదులచే నపరిచ్ఛేద్యము. ఇదియే అవ్యాకృతము. ఓంకారమును ధ్యానము చేయునప్పుడు కొంతదూరమువరకు మాత్రమే శబ్దము కలుగును. ఈ శబ్దము ప్రథమమున స్థూలముగ బయలుదేరి క్రమేణ సూక్ష్మాతిసూక్ష్మమై పిమ్మట నిశ్శబ్దమందు లయమగును. అట్టి శబ్దలయస్థానమే పరమపదము. ఎట్లన:—

"శబ్ద శ్చాక్షరే క్షీణో నిశ్శబ్దం పరమం పదమ్."

అనుటచే శబ్దము క్రమముగ నక్షరబ్రహ్మమునందు క్షీణింపగాఁ దోపట్టు పరమపదము అని తెలుచున్నది. దీనిని గూడ బ్రహ్మమనియే చెప్పవలెనా?

"నిశ్శబ్దో బ్రహ్మఉచ్యతే."

అనగ శబ్దము-లయించు స్థానమునకు బ్రహ్మ మని పేరు. ఈ విచారణనుబట్టి బ్రహ్మము రెండువిధములుగ నున్నట్లు తెలియుచున్నది. ఒకటి శబ్దబ్రహ్మ మనియు, రెండవది నిశ్శబ్ద బ్రహ్మ మనియు ద్వివిధము. లేక సమాత్రప్రణవమనియు, అమాత్రప్రణవమనియుగూడ చెప్పవచ్చును. అనగ అకార, ఉకార, మకారములను మాత్రలు గలది యొకటి, అట్టి

మాత్రలు లేనిది మఱియొకటి. ప్రణవమే ఆత్మయని చెప్ప బడియుండుటచేత ప్రణవమునకెట్లు అకార, ఉకార, మకారము లనబడు మూడుస్థాయిలును, పిమ్మట అమాత్ర స్థాయియు మొత్తము నాలుగు స్థాయిలు ఎట్లుగలవో అట్లనే ఆత్మకు విశ్వ, తైజస, ప్రాజ్ఞ, తురీయములను నాలుగు పాద ములు కలవు. వీనిలో ప్రణవముయొక్క అకారమాత్ర ఆత్మయొక్క విశ్వపాదమునకును, ఉకారమాత్ర, తైజస పాద మునకును, మకారమాత్ర ప్రాజ్ఞ పాదమునకును— తుల్యమ గును. ఇవియే జాగ్రత్త, స్వప్న, సుషుప్తి, తురీయములను నాలుగు అవస్థలతో పోలికగలవు. ఎట్లన:—

శ్రుతి॥ (1) జాగరితస్థానో వైశ్వానరో ఽ కారః ప్రథమమాత్రా।
(2) స్వప్నస్థానస్తైజస ఉకారో ద్వితీయమాత్రా।
(3) సుషుప్తిస్థానః ప్రాజ్ఞో మకార స్తృతీయమాత్రా
(4) అమాత్ర శ్చతుర్థో ఽవ్యవహార్యః ప్రపంచోపశమ
శ్శివో ఽద్వైత ఏవ మోంకార ఆత్మైవ సంవిశ త్యాత్మనాత్మానం యఏవం వేద, యఏవం వేద॥

ఈ మాండూక్యోపనిషద్వాక్యమును బట్టి అకార, ఉకార, మకార, అర్థమాత్ర (లేక అమాత్ర) అను నాలుగు మాత్రలుగల ఓంకారమునందు అనిరుద్ధ, ప్రద్యుమ్న, సంక ర్షణ, వాసుదేవ అను నామాంతరములుగల విశ్వ, తైజస, ప్రాజ్ఞ, తురీయములను నాలుగు పాదములతో గూడిన బ్రహ్మమును ధ్యానించునపుడు మొదటి మూడుపాదముల

వరకు శబ్దము కలుగుచుండును. పిమ్మట నాల్గవపాదమున శబ్దము లయమొంది నిశ్శబ్దమగును. అట్టి నిశ్శబ్దస్థానము యొక్క లక్షణ మే మను ప్రశ్నకు జవాబును వినుడు:—

అదృష్ట మవ్యవహార మగ్రాహ్య మలక్షణ
మచింత్య మవ్యపదేశ్య మైకాత్మ్యప్రత్య
సారం ప్రపంచోపశమం శాంతం శివ మద్వై
తం చతుర్థం మన్య న్తే స ఆత్మా స విజ్ఞేయః॥

ఈ శ్రుతినిబట్టి బ్రహ్మప్రణవముయొక్క నాల్గవ పాదమైన నిశ్శబ్దస్థానము అఖండమును, సర్వవ్యాపకమును, సత్యస్వరూపమును, శుద్ధచైతన్యస్వరూపమును, కేవల సుఖ స్వరూపమును అయి యున్నది.

సర్వ మోంకారఏవ యచ్చాన్య త్త్రికాలాతీతం।
తద ప్యోంకార ఏవ॥

అనగ భూతభవిష్యద్వర్తమానరూపమగు కాలత్రియముచే పరిచ్ఛిన్నంబైన శబ్దపాదంబులును, అపరిచ్ఛిన్నంబగు అశబ్దపాదమును సర్వము ఓంకారమునకు వేరు గాదు.

ఈ విచారణయందు (1) శబ్దబ్రహ్మము (2) నిశ్శబ్ద బ్రహ్మము అని రెండు విధములగు బ్రహ్మములు ప్రతిపాదింపబడినవి. అట్లైన-చో బ్రహ్మముయొక్క అద్వైతసిద్ధాంతమునకు హాని గలిగి ద్వైతము సిద్ధించుగదా! అని శంక యొకటి కలుగవచ్చును. కాని అట్టి భయమున కవకాశ మేమియు లేదు. ఏలనన శబ్దబ్రహ్మ మనునది మాయచేతను, మాయా

కార్యముచేతను ఏర్పడుచున్నది. కాని వాస్తవముగ నయ్యది లేదు. ఎట్లన:—

శ్రుతి॥ మాయాకార్యాదికం నాస్తిమాయానాస్తిభయంనహి॥
ఇదం ప్రపంచం నాస్త్యేవ, నోత్పన్నం, నోస్థితంక్వచిత్॥
—తేజోబిందూపనిషత్

అనగ మాయయును, మాయాకార్యమైన ఈ దృశ్య ప్రపంచమును లేవు. భయపడనక్కరలేదు. ఈ జగత్తు ఎప్పుడు పుట్టలేదు. ఉండనులేదు. అనగ, భ్రమాత్మకము అని యర్థము. కాన శబ్ద బ్రహ్మము, నిశ్శబ్దము అను రెండు వస్తువులు లేవనియు, ఉన్నదంతయు పరిపూర్ణ అఖండమైన చైతన్య మొక్కటియే అయియున్నది. కాన అద్వైతహాని లేదు. ఇంతవరకు ప్రణవచక్రముయొక్క శబ్దాశబ్దభాగములు వివరింపబడినవి. ఇటులనే, రాటచక్రముయొక్క శబ్దాశబ్ద భాగములు తెలుపబడవలసియున్నవి. రాటముపై, ఏకు నుండి దారమునుతీసి పురెక్కించు పర్యంతము ఓమ్ అను శబ్దము వినబడుచుండును. కాని ఆదారమును కదురుకు చుట్టునపుడు శబ్దమంతరించి నిశ్శబ్దమగుట రాటము ను ద్రిప్పు ప్రతివానికి ప్రత్యక్షముగ తెలిసిన విషయమే. కాన శబ్దము కలుగుటయందును, శబ్దము లయించుటయందును రాటచక్రమునకును, ప్రణవచక్రమునకును పోలికయున్నట్లు రుజువు చేయబడెను.

నెం V రు. పోలిక=ఉపయోగించినచో రెండును ముక్తినిచ్చును.

(1) రాటచక్రము నుపయోగించినయెడల ఆర్థికముక్తి కలుగును. ఎట్లన,

"కృషితో నాస్తి దుర్భిక్షమ్."

అనగ కష్టపడి రాటమును కృషిచేసినవానికి దారిద్ర్యభయము లేదు అని యర్థము. మఱియు,

"రాటము బీదవానికి పట్టుకొమ్మ."

అని హెన్రీ థామస్‌కోల్ బ్రూక్ అను ఆంగ్లేయ ప్రభుత్వోద్యోగి గాంధిమహాత్ముడు పుట్టుటకు 75 సంవత్సరములకు పూర్వము అనగ క్రీ. శె. 1800 సం॥ న "వంగరాష్ట్ర వ్యవసాయము" అను గ్రంథమున వ్రాసియుండెను.

(2) బ్రహ్మచక్రము ననుసరించినచో పారమార్థికముక్తి కలుగును. ఎట్లన,

"జపతో నాస్తి పాతకమ్."

అనగ ప్రణవజపము చేసినవానికి ఉపాత్తదురితక్షయద్వారా సంసారవిముక్తి కలుగును.

నెం VI. పోలిక ఉపయోగ పరచనియెడల

రెండును అనర్థదాయకములు.

(1) రాటచక్రమును విడనాడిన యెడల లక్ష్మిని విడనాడినవాని కేగతి పట్టునో ఆగతియే పట్టును. అనగ

అలక్ష్మి (పెద్దమ్మోరు=దరిద్రము) వాటిల్లును. పూర్వకాలమున భారతదేశమున ప్రతిగృహమునందును రాటము తిరుగుచుండినప్పుడు దేశము పాడిపంటలతోను, దుకూలవస్త్రములతోను నిండియుండుటేగాక వస్త్రాదులు పరదేశముల కెగుమతియగుచు, అచ్చటి ధన మంతయు మన దేశమునకు ప్రవాహమగుచుండెను. అట్టిరాట మిప్పుడు మూలబడుటచే మనదేశమునకు అన్నవస్త్రములకు కఱవై, ఇతర దేశములనుండి గుడ్డ నుదిగుమతిచేసికొనవలసినగతి పట్టినది.

(b) ఇటులనే బ్రహ్మచక్రము ననుసరించనివాడు వ్యర్థజీవియై పాపకూపమున బడును. ఎట్లన,

ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయ తీహ యః,
అఘాయు రింద్రియారామో మోఘం పార్థ! స జీవతి॥

అనగ ఈప్రణవచక్రమును ఎవడు అనుసరింపడో వాడు పాపజీవనము గలవాడును, విషయాసక్తుడును, నిష్ప్రయోజకుడును నగుచున్నాడు.

ఇన్ని విషయములలో రాటచక్రమును బ్రహ్మచక్రమును పోలికలు కలిగియున్నట్లు రుజువైనది. కాన నీ రెండింటికి అవినాభావసంబంధము కలదు. ఒకటి ఇహసంబంధము. మఱియొకటి పరసంబంధము. మొదటిది భుక్తిమూలము. రెండవది ముక్తిహేతువు. రెండును ఒకే వస్తువుయొక్క భిన్నరూపములై యున్నవి. రెండును పూర్ణములే (చక్రములే). ఈ రెంటికిని మధ్య మాయ (అజ్ఞానము) అను ఉపాధి

(అద్దమువంటిది) ఒకటి కలదు. అందుచే రెండవది **మొదటి** దానియొక్క ప్రతిబింబ (Reflection) మై యున్నది. అందుచే తలక్రిందుగ మాత్రము కనుపించును. ఇట్లు కనుపింపచేయుట మధ్యనుండు మాయ (Mirror) యొక్క లక్షణమై యున్నది. ఆమాయను జయించినవానికి ఏకత్వము సిద్ధించును. అనగ ఒకదానియందే రెండును యున్న ట్లగును.

నెం V రు పటము.




ఓమ్.

పూర్ణమదః పూర్ణ మిదం పూర్ణా త్పూర్ణ ముదచ్యతే।
పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణమే వావశిష్యతే॥

—శుక్లయజుర్వేదమ్.

అనగ యీ కనబడుచున్నది పూర్ణము (చక్రము). ఆకనబడకయున్నది పూర్ణము (చక్రము). దీని నతిక్రమించి అది యున్నది. దానిని పొందితే దీనిని పొందినట్లే. ఇదియే అది. అదియే యిది.

క్రింది దానికి మూలము (వేరు) పైది. పై దానికి శాఖలు (కొమ్మలు) క్రిందది. ఈ రెండును కలిసి యొక వృక్షము అనవచ్చును. ఈ వృక్షమునకు పర్ణములు (ఆకులు) వేద ములు. ఆకులు చెట్టును ఎండ తగలనీయక కాపాడునట్లు, వేదములు ఈ సంసారవృక్షమును అధర్మమునుండి కాపాడు చున్నవి.

ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్।
ఛన్దాంసి యస్య పర్ణాని య స్తం వేద స వేదవిత్॥
—భగవద్గీత అ. 5 శ్లో. 1.

అనగ బ్రహ్మమే వేరుగాగలదియు, మహదాది తత్వ ములే కొమ్మలుగా గలదియునగు ఈ సంసార (అశ్వత్థ) వృక్షము జ్ఞానోత్పత్తియగువరకు శాశ్వతము. దీనికి వేదములు ఆకులు. దీని రహస్యము తెలిసికొనువాడు ముక్తుడగును.

ఇక్కడ నొక సందియము పొడమవచ్చును. "క్రింద చక్రమునకు పైచక్రము వేరువంటిది." అనినప్పుడు క్రింద దానిని పుట్టించినది పైదియే యని యర్థమగును. కాని ఆత్మకు కర్తృత్వభోక్తృత్వములు లేవని చెప్పు ఈ క్రిందిప్రమాణ వాక్యములకు వైయర్థ్యము తటస్థించు ననవచ్చును. ఎట్లన-

న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన॥

అనగ అర్జునా, మూడు లోకములయందు నాకు చేయదగిన కర్మ లేనే లేదు. మఱియు—

తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తారమవ్యయమ్.

అనియు—

నమాం కర్మాణి లిమ్పన్తి నమే కర్మఫలే స్పృహా॥

అనగ "నన్ను కర్మ లంటవు. నాకు కర్మఫలమందు కోరికయును లేదు" అని భగవానుడు చేసిన ప్రతిజ్ఞకు హాని వచ్చు నని సందేహపడుదురేమో? అట్లు కాదు. ఆత్మయొక్క అకర్తృత్వమునకును, తాటస్థ్యమునకును లోటురాకుండగనే కర్తృత్వము నవలంబించుటకు వీలు కలదు. అయస్కాంతము (సూదంటురాయి) తాను ఏమియు కర్మచేయకయే తన సన్నిధానముననున్న ఇనుము (సూది) చేత పనిచేయించుచుండుట లోకప్రసిద్ధమైన విషయమేగదా! అట్లనే ఆత్మ తా నేమియు చేయదు. కాని అతని సన్నిధానమహిమచే మాయ (ఆత్మ శక్తి లేక ప్రకృతి) సృష్టికార్యము నడుపగలుగుచున్నది. ఈ సమాధానమును భగవానుడే యిచ్చియున్నాడు. వినుడు—

అజోఽపిసన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్।
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సమ్భవా మ్యాత్మమాయయా॥

—భగవద్గీత అ. 4 శ్లో. 6.

మఱియు—

ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునఃపునః॥

—భగవద్గీత అ. 9 శ్లో. 8.

అనగ నేను పుట్టుక లేనివాడనైనను నా స్వశక్తియైనమాయను వశపరచుకొని పుట్టుచున్నాను. అనగ పుట్టుచున్నట్లు అగపడుచున్నాను. ఈతత్వమును గ్రహించినయెడల పైన దెల్పిన,

"ఊర్ధ్వమూల మధశ్శాఖం"

అను విషయము సుబోధకము కాగలదు.

ఉపసంహారము - (రుజువుచేసిన విషయములు)

1. రాటచక్రమే బ్రహ్మచక్రము.
2. రాటనాదమే బ్రహ్మనాదము.
3. రాటనాదము మనస్సును నిశ్శబ్దమునకు తీసికొని పోగలదు.
4. అట్టి నాదానుసంధానముతో తీయబడిన నూలు (కద్దరు) కూడ చిత్తమును నిశ్శబ్దమునకు తోడ్కొని పోగలదు. ఎట్లన,

"కారణగుణాః కార్యే సంక్రమన్తి."

అనగ "కారణమం దేశక్తికలదో, కార్యమందును అట్టి శక్తి సంక్రమించును" = ("As is the cause, so is the consequence.") అను సిద్ధాంతమును బట్టి కద్దరు నిశ్శబ్దకారక (Conductor of nonsound) మైనది. కాని జగదీశచంద్రబోసుగారి సిద్ధాంత మేమి? "కద్దరు శబ్దనివారకము" అని వారు చెప్పిరి.

హిందూ వేదాంతశాస్త్రరీత్యా రుజువైన

(1) "కద్దరు నిశ్శబ్దకారకము" (Conductor of nonsound) అను సిద్ధాంతమునకును పాశ్చాత్యప్రకృతిశాస్త్ర రీత్యారుజువైన

(2) "కద్దరు శబ్దనివారకము" (Non conductor of sound) అను సిద్ధాంతమునకును భేద మేమైన కలదా? ఈరెండును ఒకేతత్వముయొక్క (1) ముఖ్య (2) గౌణ పార్శ్వములై యున్నవి. ఉల్టా సీద అనికూడ చెప్పెదరు. (The two are the obverse and the reverse sides of the same truth)

"నిశ్శబ్దో బ్రహ్మ ఉచ్యతే."

అను ప్రమాణమును బట్టి కద్దరును ధరించువారికి బోసుగారు చెప్పినట్లు ఇహలోకశాంతి కలుగుటయేగాక వేదాంతశాస్త్రరీత్యా పరలోకశాంతి (బ్రహ్మత్వము) కూడ క్రమశః లభించగల దని యీదాసునియొక్క అనుభవమును నివేదించుకొనుచున్నాడు.

కద్దరునందిట్టి పారమార్థికతత్వ ముండుటచేతనే జె. సి. బోసుగారు మహాత్ముని నభినందించియున్నారు. భారతదేశదారిద్ర్యవిముక్తికై మహాత్ముడు కద్దరుసందేశమును చాటియున్నాడు. ఈకద్దరు సందేశమునందలి పారమార్థిక తత్వము అతిరహస్యమై యున్నది. దీని ననుసరించి జీవితమును నడుపుకొనువారలకు మహాత్ముని యనుగ్రహమువలన

సర్వబంధనివృత్తిపూర్వకమైన శాంతి కలుగును. ఇయ్యది భగవదాదేశము కాన భారతీయులందరును మహాత్ముని శరణు బొందవలసియున్నారు.

తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత !
తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్॥

ఓ భారతీయుడా ! సమస్తవిధములచేతను ఆమహాత్మునే శరణుబొందుము. ఆయన యనుగ్రహమువలన ఉత్తమమైన శాంతిని, నిత్యమైన మోక్షమును బడయగలవు. అని శ్రీకృష్ణభగవానులు అర్జునునకు సందేశము నిచ్చియున్నాడు. భారతీయుల దాస్యవిముక్తికి నింతకంటె రహస్యమైన తత్త్వోపదేశము మఱియొకటి లేదు. కాన దీనిని చక్కగ విమర్శించి అనుష్ఠించవలసియున్నారు.

ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా।
విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు॥

—భగవద్గీత అ. 18 శ్లో. 62-63.

అనగ రహస్యము లన్నిటికంటె అతిరహస్యమైన ఈ తత్త్వము నాచేత నీకు చెప్పబడినది. పూర్తిగ విచారించుకొని నీయిష్టము వచ్చినట్లు చేయుము అని యర్థము. మహాత్మునియందు భక్తివిశ్వాసములు గలవారి కందరికిని ఈపారమార్థికరహస్యమును పత్రికలమూలమునగాని, గ్రంథముల మూలమునగాని ప్రకటించి తెలిపినవారికి శ్రేష్ఠమైన భగవ

ద్భక్తి జనించి వారు భగవంతుని సాయుజ్యమును బొందుదు రనుట కీ క్రింది గీతావచనమును వినుడు—

యఇమం పరమం గుహ్యం మద్భక్తే ష్వభిధాస్యతి,
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్య త్యసంశయః.

అనగ అతిరహస్యమైన ఈతత్వము నెవరు నాభక్తులకు చెప్పగలరో అట్టివాడు నాయందు శ్రేష్ఠమైన భక్తిని బూని, సందేహము లేనివాడై నన్నే బొందగలడు అనియర్థము. ఈ రహస్యమును వెల్లడించినవారికి పుణ్యము గలుగుటయే గాక ప్రచురించుట కెవ్విధమైన సహాయ మొనర్చినవారికి నట్టి పుణ్యము ప్రాప్తించు ననుట నిర్వివాదాంశము. ఇంతే గాక, ఈతత్వమును శ్రద్ధతో శ్రవణ మొనర్చినవారలకు గూడ పుణ్యలోకప్రాప్తి గలుగును. ఎట్లన—

శ్రద్ధావా ననసూయశ్చ శృణుయాదపి యో నరః,
సోపిముక్తశ్శుభాన్ లోకాన్ ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్.
—భగవద్గీత అ. 18 శ్లో. 71.

అనగ ఏమనుష్యుడు ఆస్తికబుద్ధిగలవాడును, అసూయలేనివాడును నై ఈ పరమరహస్యార్థమును శ్రవణ మొనర్చునో అట్టివాడుగూడ సమస్తపాపములచే విడువబడినవాడై పుణ్యవంతులయొక్క లోకములను బొందును అని యర్థము.

ఓమ్ తత్సత్,
కద్దరుప్రియుడు.

# తుదిపలుకు.

ఈ ఖాదీతత్త్వ మను గ్రంథమును తయారుజేయించి లోకములో ప్రకాశమునకు తెచ్చుటకై పూనుకొనియుండిన యొక వ్యక్తినిగూర్చి యిచ్చట ముచ్చటించుట యవసరమని యెంచి వాని సంగ్రహజీవితచరిత్రమును యిందు పొందుపఱచు చున్నాము.

ఈ వ్యక్తి కోట నాగభూషణంగారు. వీరు గుంటూరు జిల్లా మంగళగిరి తాలూకా చిరావూరు గ్రామకాపురస్థులు. వీరి తల్లిదండ్రులు సజీవులై యున్నారు. తండ్రిపేరు కోట రామన్నగారు; తల్లిపేరు మాణిక్యమ్మగారు. వీరు వైశ్యులు. దైవభక్తిగలవారు. వీరికి ముగ్గురు పుత్రులును నలుగురు పుత్రికలును గలరు. మన కథానాయకుడు వీరి ద్వితీయ పుత్రుడు. ఈయన వయస్సు ఇప్పుడు 30 సంవత్సరములు. అందరివలెనే మామూలుగ నీతడును పల్లెటూరు బడిలో తెలుగుభాషను నేర్చుకొనియుండెను. వీరిగ్రామము మెట్ట పరగణాకు చేరియున్నది. ఇక్కడనుండి మిరపకాయ, వేరు శెనగ, కందులు, శెనగలు మున్నగు మెట్టపంటవస్తువులు బెజవాడ, గుంటూరు మున్నగు బస్తీలకు రైతులు చేర్చి సాహుకార్లకు విక్రయించుకొని తద్వారా జీవనమును గడుపు కొనుచుందురు. మన కథానాయకుడు తెలుగున లెక్క వ్రాయుటయు జమాఖర్చును స్వంతముగ చిఠాను జేర్చి ఎప్పటి కప్పుడు నిలవమొత్తమును సక్రమముగ తీసి చూపగల

వ్యవహారసమర్ధతను కలిగియుండుటే గాక, పంటవస్తువు లను బస్తీలకుజేర్చి విక్రయించుకొను రైతుల పరిచయ మును గలవాడై వారియొక్క ప్రేమను విశేషముగ సంపాదించినవాడై యుండెను. ఈ కారణముచే యితని తల్లి దండ్రులీతనిని ఒకబస్తీకి పంపి, ఒక సాహుకారుయొద్ద వర్తక లెక్కలను వ్రాయు గుమాస్తాగ తర్బీయతు చేయించి పిమ్మట వాణిజ్యవృత్తిలో ప్రవేశపెట్టుటకు సంకల్పించి యుండిరి. కాని గుమాస్తాలను కేవలము నౌకర్లవలెను, బానిసలవలెను చూడక వారిని బిడ్డలవలె నాదరించి అభి వృద్ధికి తీసికొనిరా గలిగిన సాహుకార్లుగాని, వర్తక శిఖా మణులుగాని యీకాలమున తరుచుగనుండుట దుర్లభము. కాని మనకథానాయకుని పూర్వపుణ్యవిశేషమున మంచి సాంప్ర దాయము గలిగినట్టి ఉదాచరితులును, దైవభక్తిపరాయ ణులును నగు శ్రీ మాజేటి అంకయ్యగారియందను ఇతనిని చేర్చుటతటస్థించినందుకు ఆగ్రామవాసులందరకును కడుసంత సము కలిగినది. ఇతడు త్వరలో వృద్ధికాముడు కాగలడని బంధు వులును, మిత్రులును ఆశీర్వదించిరి. మాజేటి అంకయ్యగారు బెజవాడ కమిూషన్ వర్తకశిఖామణులలో నొకరు. వీరికి వ్యాపారబాహుళ్యము కలదు. వీరి తండ్రిగారు భగవద్భక్తు లును, ఇంద్రకీలాద్రియందు వేంచేసియుండిన శ్రీదుర్గామల్లేశ్వ రాలయములకు ధర్మకర్తగానుండి దేవాలయకట్టడములు మొ దలగు పుణ్యకార్యములను భక్తిశ్రద్ధలతో జరిపించుటయేగాక యాత్రికుల కనేకసౌకర్యములను కలుగజేసియుండిన ధార్మిక

చరితులు. కీర్తిశేషులగు మాజేటి నాగభూషణంగారి నెఱుగనివారుగాని, వారివలనమేలును బొందనివారుగాని, ఈపురమునలేరనుట అతిశయోక్తిగానేరదు. అట్టివారి గర్భమున జన్మించిన శ్రీ అంకయ్యాగారును తమతండ్రిగారిప్రతిష్ఠకు భంగములేకుండ ధర్మకార్యములం దత్యుత్సాహమును జూపుచు, దేవాలయపరిపాలనమును యథావిధిగ జరుపుచు, తీర్థయాత్రికులక్షేమముకొఱకు, కొండమీదను మంచి సౌకర్యముల నేర్పరచియున్నారు. దేవాలయధర్మకర్తలలో వీ రొకరు. వీ రిప్పుడు దేవాలయకార్యనిర్వాహకులుగ నున్నారు.

ఇట్టి పుణ్యపురుషునియొద్ద మన కథానాయకుడగు శ్రీయుత కోట నాగభూషణంగారు సుమారు 12 సంవత్సరముల క్రిందను గుమాస్తాగా చేరిరి. తన గ్రామమునుండి పంటసరుకులను దెచ్చు రైతులు విశేషముగ ఇతని యజమానులైన అంకయ్యాగారికి ఖాతాదారులుగ యేర్పడి, తమ పంటదినుసులను వీరికే విక్రయించుచుండిరి. ఈ వ్యాపారభాగమునంతను నడుపుటకై మన కథానాయకుడు నియమింపబడెను. ఇతడు ఈ వ్యవహారమును కడు సమర్థతతో చక్కబెట్టుచు తన యజమానునికి సంతృప్తి కలుగజేయుచు వారియాదరణమునకు విశేషముగ పాత్రుడయ్యెను. అంకయ్యగారును-వారి తల్లియు-భార్యయును మన నాగభూషణంగారిని కేవలము గుమాస్తాదృష్టితో జూడక తమ స్వంతబిడ్డవలె నాదరించి పోషించుచుండిరి. వ్యవహారవిషయమున మన కథానాయకుని దక్షతయును, వానికి సహజముగ గల

నమ్రీభావమును, పెద్దలయెడగల భక్తియు ఇతని యభివృద్ధికి ముఖ్యకారణము లయ్యెను. ఇతడు తన యజమానుని వర్తక వ్యవహారములను శ్రద్ధతో నడుపుచుండియు, దేశాభ్యుదయమును గోరు ప్రతియుద్యమమునందును ఉడుతాభక్తిగ సేవజేయుటకు ఉల్లాసమును జూపుచుండువాడై యుండెను.

తాను వైశ్యవర్ణమునకు జెందియుండుటచే తన వర్ణమునకు సేవసేయుటయందు ముందంజవేయుచుండును. అన్ని వర్ణములతోబాటు వైశ్యవర్ణముగూడ పవిత్రవంతమైనదనియు, కర్మలోపము లేనైన నున్నయెడల పెద్దలవలన తెలిసికొని సంస్కరింపచేయుట యుక్తమనియు ఇతడు వాదించుచు యీ విషయమై తన వర్ణస్థులకు వేదోక్తసంస్కారవిధులను తెలుపు నొక గ్రంథమును వ్రాయించి ప్రకటించియుండెను. వైశ్యవేదోక్తసంస్కారప్రోత్సాహకసంఘము నొకదానిని స్థాపించి తద్వారా వేదకర్మాచరణావశ్యకతను గూర్చి తన వర్ణమువారికి ప్రబోధమును గావించియుండెను. పురమందంతటను కరపత్రములను పంచిపెట్టి, వైశ్యులలో నిద్రాణంబైయున్న శక్తిని మేల్కొల్పి, వారియందు కులాభిమానమును, విద్యాశక్తిని పురికొల్పియుండెను. వీరు ప్రచురించిన గ్రంథమునకు "వైశ్యవిద్యాభానూదయము" అను పేరు సార్థకమై యొప్పెను. ఈ గ్రంథప్రతులు ఉచితముగ బెజవాడ వైశ్యులకే గాక ఆంధ్ర జిల్లాలలోని ప్రముఖులకును, విద్యాసంస్థలకును బంపబడెను. ఇందువలన వైశ్యమండలియందు వేదోక్తకర్మాసక్తియు, విద్యాభిమా

నమును రగుల్కొనెను. ఈవిధముగ మనకథానాయకుడు స్వసంఘమునకు సేవచేయ గలిగెను.

విజయవాడ వైశ్యమహాసభను యేర్పాటు చేయుటలో మనకథానాయకుని కృషి విశేషముగ గలదు. అందలి విద్యాశాఖలో పనిచేసి విద్యావిషయమై వైశ్యులు శ్రద్ధను తీసికొనవలయు నని ప్రబోధము కలుగజేయుటకై విద్య అను పేరుతో కొన్ని కరపత్రములను పంచిపెట్టి ప్రచారముచేసియుండెను. వైశ్యవిద్యానిధి నొకదానిని శాశ్వతముగ స్థాపించి బీద వైశ్యబాలురకు సహాయము చేయవలెననియు, విద్యార్థులకు అక్కడక్కడ వసతిగృహములను నెలకొల్పవలెననియు సంకల్పించి ఇందుకై కొంత పాటుపడెను.

పిమ్మట మహాత్ముడు తలపెట్టిన కద్దరు ఉద్యమము నందు సేవచేయ మొదలు పెట్టెను. విజయవాడ వైశ్యమహాసభయందు కద్దరుశాఖ నొకదానిని ప్రత్యేకముగ స్థాపించి కద్దరుప్రచారమునకు కావలసిన చందాలను, విరాళములను పోగుచేసి కద్దరుశాఖవారికి కుడిభుజమై నిలిచి సహాయము చేసెను. కద్దరుత్పత్తియు, కద్దరుధారణమును ప్రతిహైందవునకును, ప్రతి భారతీయునకును కర్తవ్యమని ప్రబోధించుటకై కద్దరు కరపత్రములను పురమందు పంచిపెట్టించి ప్రచారము చేయించెను. స్త్రీలలో కద్ద రభిమానమును పురికొల్పుటకై కావింపబడిన చర్ఖా గౌరీపూజలు, ఊరేగింపులు, ఉత్సవములు మున్నగు కార్యములయందు ఇతడు మిక్కిలి తోడ్పాటు కావించుచుండెను. పల్లెటూళ్ళకు స్వయముగ వెళ్లి

రాటపు కదుళ్లు, చెవ్రులు, ఏకులు మొదలగు పరికరములను చవుకగా చేయించుకొని వచ్చి కద్దరుశాఖవారికి సరఫరా చేయుటయందు మిక్కిలి ప్రయాసపడి యుండెను. కద్దరు ఉద్యమమునకు తోడ్పడి ప్రచారకార్యములయందు మగ్నుడై యుండుటేగాక ఇంటియొద్ద నున్నప్పుడు రాటముమీదను బైటతిరుగునప్పుడెల్ల తకిలీమీదను స్వంతముగ నూలు వడుకుచు ఇతరులకు మార్గదర్శి యయ్యెను. తకిలీమీద దారము తీయుటలో ఇతడు నేర్పరి యనవచ్చును. కద్దరునుగూర్చి సంపూర్ణతత్త్వమును దెలుపుచు శాశ్వతముగనుండు నొక గ్రంథము తయారుచేయించి ప్రకటించవలెననుట మన కథానాయకుని ఆశయములలో మిన్నయై యొప్పుచుండెను. ఇందుకై ధనవంతుల యిండ్లకేగి చందాలు వేయించి ధనమును పోగుచేసి యుండెను. కొందరు పెద్దల నాశ్రయించి కద్దరుయొక్క పూర్వచరిత్రను, కద్దరునందుగల ఆర్థిక, రాజకీయ, పారమార్థిక తత్త్వములను గూర్చియు, జె. సి. బోసుగారి కద్దరుతత్త్వమును గూర్చియు వ్యాసములను వ్రాయించి అచ్చుకు పంపించి యుండెను. ఇట్టిస్థితిలో క్రిమినల్ లా అమెండు మెంటు ఆకు అను శిక్షాశాసనము క్రింద గవర్నమెంటువారితనిని అరెస్టుచేసి అభియోగము నొకదానిని దెచ్చిరి. ఇందుకై ఈతనిని న్యాయాధికారి విచారించి ఆరుమాసముల కారాగృహాకఠిన శిక్షను సి క్లాసు జీవనమును విధించియుండిరి. వీనిని 3-7-1930 తేదిన పోలీసువారు రాజమండ్రి సెంట్రిల్ జెయిలుకు కొని

పోయియుండెడి. ఈకారణముచేతను, మరికొన్ని కారణముల వలనను ఈతడు తలపెట్టిన ఈకద్దరుతత్త్వ మను గ్రంథము ముద్రణయగుట ఆగిపోయెను. కాని దైవానుగ్రహము వలన తిరిగి పరిస్థితు లనుకూలించినందున, ఈ గ్రంథము ద్రణము కొనసాగింపగలిగినందులకు మిగుల సంతోషము. ఈ గ్రంథమును దయారుచేయించి ప్రకాశమునకు దెచ్చి సేవసేసిన మన కథానాయకునియొక్క మేలును మేము మఱువజాలక అతనికి కృతజ్ఞతను జూపుటకై అతనికి అత్యంత ప్రీతికరమైన "కద్దరుతత్త్వము" అను నీ గ్రంథాంత మున ఆతని జీవితచరిత్రాసంగ్రహమును జేర్చి మా ఋణ మును దీర్చుకొనుచున్నాము. జగత్పోషణభారమును వహించిన వైకుంఠనాథుడును, భూభారమును వహించినట్టి ఆది శేషుని తనకంఠమందు ధరించిన నాగభూషణుడగు కైలాసాధి పతియు మన కథానాయకుడగు నాగభూషణమునకును, ఆయన కుటుంబమునకును, ఆయన నాదరించుచున్న శ్రీ మాజేటి అంకయ్యగారి కుటుంబమునకును ఆయురారోగ్యై శ్వర్యములను బ్రసాదించి కటాక్షింతురుగాక.

ఓమ్ సర్వే జనా స్సుఖినో భవన్తు.

ఇట్లు విన్నవించు,

విజయవాడ వైశ్యమహాసభ,

కద్దరుశాఖ.